# టీకా శతకములు వగైరాలు.

| | రు అ పై |
|---|---|
| బాలరామాయణము | 0-2-0 |
| సుమతీశతకము | 0-2-0 |
| కుమారీశతకము | 0-2-0 |
| కుమారశతకము | 0-2-0 |
| కృష్ణశతకము | 0-2-0 |
| నీతిశాస్త్రము | 0-2-0 |
| భాస్కరశతకం | 0-4-0 |
| నృసింహశతకము | 0-4-0 |
| కుచేలోపాఖ్యానము | 0-4-0 |
| వేమనశతకము | 0-3-0 |
| గజేంద్రమోక్షము | 0-6-0 |
| రుక్మిణీకల్యాణము | 0-6-0 |
| కాళహస్తీశ్వరశతకము | 0-4-0 |
| దాశరథీశతకము | 0-4-0 |
| న్యూఆంగ్లోతెలుగుప్రైమరు | 0-2-0 |
| అరటిచెట్టుబాలశిక్ష 64 పేజీలు గ్లేజు | 0-2-0 |

| | రు అ పై |
|---|---|
| సంస్కృతబాలశిక్ష | 0-4- |
| హిందీతెలుగుబాలబోధిని | 0-2- |
| హిందూస్థానీతెలుగుబోధిని | 0-4- |
| పంచభాషలవకాబ్యులరి | 0-6- |
| అమరముప్రథమకాండ (తాత్పర్యసహితము) | 0-6- |
| ఆంధ్రనామసంగ్రహము | 0-6- |
| ఆంధ్రనిఘంటుత్రయము రేపరు బైండు | 0-8. |
| డిటో—అట్టబైండు | 0-10. |
| డిటో-కాలికోబైండు | 0-14. |
| అమరముత్రికాండముగ్లేజుఅ బైండు | 1-0 |
| శబ్దమంజరి160పేజీలగ్లేజు | 0-3 |
| డిటోబైండు | 0-4 |
| సులక్షణసారము (ఆంధ్రతా ర్యసహితముగ్లేజు) 200పేజీ | 0-[illegible] |

శ్రీ ర స్తు

# భాస్కరశతకము

(టీకా తాత్పర్యసహితము)



శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

శ్రీరస్తు

# భాస్కర శతకము



పూర్వకవి ప్రణీతము.

నేదునూరి గంగాధరముగారిచే

వ్రాయబడిన టీకాతాత్పర్య సహితము.

రెండవకూర్పు 2000 ప్రతులు.

పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1938



[వెల రు 0-4-0.

# పీఠిక

**మహాజనులారా?**

ఆంధ్రదేశమున నానాటికి భాషాభి[illegible] మ్మగుచున్నదని పాఠకలోక మెరింగినదే. ఒకప్రక్క గ్రాంధిక గ్రామ్యభాషావాదుల వివాదసంరంభము, వేఱొకవంక నవ్య సాహిత్యపరిషత్తుయొక్క విజృంభణము, మఱొకచో భావకవి కవిమారుల కిలకిలారావములు చెలరేగి జనసామాన్యమునకు వాడుకభాషలో మహోన్నతోత్సాహము నొసంగుచున్నను తెనుఁగుదేశము ప్రాచీనకవిపుంగవులకు జోహారు లొనర్చుచునే యున్నది. అకారణమున శ్రవ్యదృశ్య ప్రబంధములందును, శతకములందును, ఆదరాభిమానములు తగ్గుదల సూపుటలేదు. అప్పటున శతకములలో గొన్నిటియందలి పద్యశైలి కఠినతరముగనుండుటచే జనసామాన్యమున కనువుగ టీకాతాత్పర్యంబుల యవసరము వాటిల్లుచున్నది. శతకములమూలముననే యాంధ్రభాషయందు భక్తియు, నీతియు ప్రబోధింపబడుట నెవ్వరు నెరుంగనిదికాదు. అట్టి శతకములలోనెల్ల నీభాస్కర శతకమొక్క యుత్తమగ్రంధము. దీనిని గూర్చి యీగ్రంధమునందే వేరొకచో కవిజీవితమను పేరిట విపులముగ చర్చించియున్నాము. ఈవిధముగ భాషాసేవచేయు నుద్దేశమే మాప్రధానాశయము. విద్యాశాఖాధికారులు మాయీయుద్యమమునకు జేయూతనిత్తురుగాక.

ఇట్లు,
ప్రకటనకర్త.

# కవి జీవితము.

"భాస్కరశతకము శతకములలో నెల్ల నగ్రగణ్యమైనదని చెప్ప నొప్పు. ఇందున్న నీతులువంటినీతులు మఱియొకదాని యందుండవని నిస్సందేహముగా జెప్పవచ్చును. భాస్కరశతకమునుగూర్చి పెక్కండ్రు పెక్కుగాథల నుడువుచున్నారు. కొందఱు భాస్కరశతకమును రచించిన కవులి రువురని చెప్పుచు నందున కొకకథ నిట్లు చెప్పుచున్నారు. "ఒక బ్రాహ్మణున కిరువురు కుమారులు. వారలతండ్రి ధనము చాలగ నార్జించి కాలధర్మము నొందెను. తరువాత నన్నదమ్ము లిరువురు తండ్రి సొత్తును బంచుకొనుటలోఁ గలహించి రాజునొద్దకుఁ దగవునకుఁ బోయిరి. ఆరాజు పేరు భాస్కరుఁడు. అతఁడు కవిత్వమందు మిగులఁ బ్రీతికలవాఁడు. అతఁడు తనయొద్దకు వచ్చినవారిరువురినిజూచి 'మీరేమి చదివినారు' అని యడుగ వారలు 'మేముశాస్త్రములు చదివినాము. తెనుఁగునబాగుగఁ గవిత్వము చెప్పఁగలము' అని పల్కిరి. అంతరాజు వారలమాటలు విని మీరు చెఱియొకగ్రంథము చేసి తీసికొనివచ్చినచో మీతగవు దీర్చెద నని చెప్పెను. అది విని వారు మాకంతయవకాశము లేదని చెప్పిరి. 'పోనిండు చెఱియొకశతకమైనఁ జేసికొనిరండని' రాజు మరలఁ జెప్పెను. అందులకు వారు 'రాజా! మాకంత యవకాశములేదు. కనుక మేమిరువురము నొక్కశతకము చేసెద' మని చెప్పి రాజు నంగీకరింపఁజేసి యాసభలో శతక

మును రచింపఁబూనిరి. వారిలోఁ బెద్దవాఁడు [illegible] జిన్నవాఁ డుత్తరార్ధమును జెప్పుచు నీరీతి శతకమును ముగించెను. ప్రతిపద్యమందును భాస్కరుఁ డనురాజును సంబోధించుచుఁ జెప్పఁబడినది కాన భాస్కరశతకమని ప్రసిద్ధికెక్కినది. తరువాత రాజు వారల పాండిత్యమునకు సంతసించి వారలు కోరినంతధనమిచ్చి వారల వీడ్కొలిపెను' అని చెప్పుచున్న యిక్కథను నమ్ముటకుఁ దగిన నిదర్శనము లేమియు లేవు. కనుక జమత్కారముగాఁ గొందఱు కల్పనచేసియుండవచ్చును. మఱికొందఱు భాస్కరశతకమును రచించినకవు లిర్వురనియు నన్నదమ్ములనియు జెప్పుచు నందులకు నొకకథను మఱియొకవిధముగా జెప్పుచున్నారు. 'ఒక బ్రాహ్మణున కిరువురుపుత్త్రులట. వారలతండ్రి చిన్నదనముననే కాలధర్మము నొందెనట. అయినను వారిలో బెద్దవాఁడు బహుశ్రద్ధతో జదివికొని కవిత్వమున మిగుల జతురతగలవా డాయెనట. చిన్నవాడు చదువక మూర్ఖుడై తిరుగుచుండెడివాడట. అంత నొకనా డాపెద్దవాడు తమ్ముని జూచి కోపించి "నీవు విద్వాంసుడవై నంగాని యింటికి రానీయ" నని చెప్పి తఱిమివేయ నతడు చేయునదిలేక కాశికిబోయి శ్రద్ధబూని యవలీలగా విద్యల బూర్తిగ నభ్యసించి కవిత్వమందుగూడ నిపుణత్వమును సంపాదించి తిరిగి యింటికివచ్చి తలుపుతీయుమని యన్నగారిని బిలిచెనట. అంతట బెద్దవాడువచ్చి యతని పాండిత్యమునడిగి తెలిసికొని నీవబద్ధము చెప్పుచున్నావేమో? నాయడిగిన ప్రశ్నలకు దగినట్టు లుత్తరము చెప్పినచో నమ్మెదనని చెప్పి ఛందోబద్ధముగా ప్రశ్నములడిగిన

నా చిన్నవాడు తన యన్నగా రడిగినప్రశ్నములకెల్ల ఛందోబద్ధ ముగానే యుత్తరములిచ్చె. ఆ పెదవాడు సూర్యోపాసనచేసి యున్నవాఁ డగుటచే భాస్కరుని సంబోధించినందున దీనికి భాస్కరశతకమని పేరు వచ్చెనఁట.

తరువాత నన్నగారు తమ్ముఁడిచ్చిన యుత్తరములకు సంతసించి గౌరవించి లోనికిఁ గొనిపోయెనఁట" అని చెప్పుచున్నవారుగూడ నందులకుఁ దగు నిదర్శనములుగాని వారల యింటిపేరుగాని, వారలపేరులుగాని చెప్పరైరి. కనుక నిదికూడ వెనుకటిదానివలెఁ గల్పింపఁబడినదై యుండును. అయిన అందుల నెంతసత్యమో తెలియదు. భాస్కరశతకమును మొదటినుండి తుదవఱకుఁ జదివినచో నొక్కఁడే రచించెనని శైలినిబట్టి చదువరులకుఁ దెలియకపోదు. అందుచే నీభాస్కరశతకము నొక్కఁడే రచించియుండునని, నిది సూర్యున కంకితంబుగ నొసంగఁబడినదనియుఁ జెప్పుటయె యుచితము. ఈభాస్కరశతకమును మారద వెంకయ్య యను కవి రచించెనని చెప్పవచ్చును. ఇతడు 18 వ శతాబ్దాంతమున నున్నవాఁడు. భాస్కరున కంకితమిచ్చుటవలన నీపేరు కలిగినది. కవిత్వము నీతిబోధకము దృష్టాంతాలంకారములచే నిండి రసవంతముగ నుండి యెంతచదివినను మరల చదువ బుద్ధిపుట్టుచుండును ఇది నూఱు పద్యంబులుకలది. ఈగ్రంథకర్తకు కుష్ఠరోగముండుటచే తద్రోగనివారణార్థము సూర్యునిగూర్చి యీ శతకమును జెప్పెనను వదంతికలదు. ఇది నిజమేకావచ్చును. దీని సత్యాసత్యముల పరిశీలనమును పాఠకలోకమునకే విడచుచున్నాము.

వ్యాఖ్యాత.



శ్రీరస్తు

# భాస్కరశతకము.

టీకాతాత్పర్యసహితము.





శ్రీగలభాగ్యశాలిఁ గడుఁ
జేరఁగవత్తురు తారుదారె దూ
రాగమన ప్రయాసమున
కాదట నోర్చియునైన నిల్వను
ద్యోగముచేసి రత్ననిల
యుండనికాదె సమస్తవాహినుల్
సాగరుఁజేరుటెల్ల ముని
సన్నుత మధురమూర్తి భాస్కరా.

టీ. మునిసన్నుత=మునులచేఁ గొనియాడఁబడిన, మధురమూర్తి=నాకు మనస్సునకుప్రియుఁడవగు, భాస్కరా=ఓ సూర్యభగవానుఁడా! దూరాగమన ప్రయాసమునకున్=మార్గమునుండి వచ్చుటవలనఁ గలిగిన శ్రమను, ఓర్చియున్=ఓర్చియు, నిల్వన్=నివసించుటకు, ఉద్యోగముచేసి=యత్నించి, తారుతారె=తమంతటతామే, ఆసటన్=శ్రమతో, శ్రీగలభాగ్యశాలిన్=

ధనముగల భాగ్యవంతుని, కడుక్=మిక్కిలి చేరగవత్తురు=సమీపింతురు. (మనుజులనుకర్తృపదము దెచ్చుకోవలెను.) సమస్తవాహినుల్=నదులన్నియు, సాగరుక్=సముద్రుని, చేరవెల్లక్=చేరుటంతయు, రత్ననిలయుండనికాదె=రత్నముల కునికిపట్టుగాఁ గలవాఁడనియే కదా!

తా. భాస్కరా! నదులన్నియు రత్నాకరుఁడను నాశతో సముద్రుని జేరువిధముగా జనులు దూరమునుండి వచ్చుటవలన గలిగిన కష్టములను సహించి, నివసించుటకు యత్నించి తమంతటఁ దామే ప్రేమతో ధనవంతుని దగ్గరకు చేరుదురు.

ఉ. అంగన నమ్మరాదు తనయంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు వివేకియైన సా
రంగధరుం బదంబులుఁ గరంబులుఁ గోయఁగజేసెఁ దొల్లిచి
త్రాంగియనేకముల్ నుడువరాని కుయుక్తులుపన్ని భాస్కరా!

టీ. భాస్కరా! తనయంకెకుక్=స్వాధీనమునకు, రానిమహాబలాఢ్యుని=రానట్టి గొప్పబలవంతుడైనను, వేభంగుల=అనేక విధములుగా, మాయలు, ఒడ్డి=కల్పించి, చెఱుపక్=పాడుచేయుటకు, తలపెట్టుక్=ఆలోచించును. (కాబట్టి) అంగనక్=స్త్రీని, నమ్మరాదు. తొల్లి=పూర్వకాలమందు, చిత్రాంగి=రాజరాజనరేంద్రుని రెండవభార్య, వివేకియైన=జ్ఞానవంతుఁడైన, సారంగధరుక్=సారంగధరుని, నుడువరాని=చెప్పుటకు వీలుగాని, కుయుక్తులు=చెడ్డపన్నాగములు, పన్ని, పదంబులు=కాళ్ళు, కరంబులు=చేతులు, కోయగజేసెక్=నఱికించినట్లు చేసెను.

తా. పూర్వము చిత్రాంగి బుద్ధిమంతుఁడగు సారంగధరునిపై చెప్పుటకు వీలుగాని చెడ్డపన్నాగములు పన్ని, యాతని కాళ్ళు, చేతులు నఱికించిన విధముగా స్త్రీలు తమకు స్వాధీనముకాని బలవంతుని గూడ ననేక మాయలు పన్ని పాడుచేయుటకు నాలోచింతురు. కావున స్త్రీలను నమ్మకూడదు.

పూర్వగాథ:- రాజమహేంద్రపురము పాలించిన రాజరాజనరేంద్రుని పెద్దభార్య రత్నాంగి. ఈమె కుమారుడు సారంగధరుడు. రాజరాజనరేంద్రుని రెండవభార్య చిత్రాంగి రాజు వేటకువెళ్ళియుండగా సారంగధరుడు చిత్రాంగి మేడపై వ్రాలిన తన పావురమును తెచ్చుకొనుటకు వెళ్ళగా, చిత్రాంగి అతనిని జూచి మోహించి పట్టుకొనబోగా సారంగధరుడెన్ని చెప్పినను వినక పారిపోయెను. తనకోరిక నెఱవేరనందున చిత్రాంగి సారంగధరునిపై లేని నేరములు కల్పించి రాజుతో చెప్పి కాళ్ళు, చేతులు నఱికించెను.

ఉ॥ అక్కఱపాటువచ్చుసమయంబునఁ జుట్టము లొక్కరొక్కరి
న్మక్కువ నుద్ధరించుటలు మైత్రికిఁజూడఁగ యుక్తమేసుమీ
యొక్కట నీటిలో మెరక నోడల బండ్లును బండ్ల నోడలు
దక్కక వచ్చుచుండుట నిదానముగాదె తలంప భాస్కరా.

టీ. భాస్కరా, అక్కరపాటు=తగిన యవసరము, వచ్చుసమయంబునను=వచ్చువేళయందు, చుట్టములు, ఒక్కరొక్కరిన్=ఒకరి నొకరు, మక్కువన్=కూర్మిచేత, ఉద్ధరించుటలు=కష్టములనుండి లేవనెత్తుకొనుటలు, చూడఁగన్=ఆలోచింపగా, మైత్రికిన్=స్నేహమునకు, యుక్తమేసుమీ=తగినదేసుమా! (ఎట్లనగా) ఒక్కటన్=ఒకసమయమందు, నీటిలోన్=నీటియందు, ఓడలన్=ఓడలందు, బండ్లును, మెరకన్ = మెట్టభూమియందు, బండ్లన్=బండ్లయందు, ఓడలున్=ఓడలును, తక్కక=ఆగక, వచ్చుచుండుట, తలంపన్=ఆలోచింపఁగా, నిదానముగాదె=ప్రత్యక్షమేకదా!

తా. ఒకానొక సమయంబున నీటిలోఁ బడవలమీఁద బండ్లును, మెరకభూమియందు బండ్లమీఁద పడవలును, వచ్చుచుండుట ప్రత్యక్షము. అట్లే తగిన యవసరమువచ్చు కాలమున బంధువు లొకరి నొకరు కాపాడుకొనుట స్నేహమునకు మంచిది.

చ. అడిగినయట్టియాచకుల యాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొకానొకయప్పుడు నీదు వానికె
య్యెడల నదెట్లు పాలు తమ కిచ్చునె యెచ్చటనైన లేగలన్
గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నునుగాక భాస్కరా.

టీ. భాస్కరా! (మనుష్యుఁడు) లోభవర్తియై=పిసినిగొట్టుతనముగల వాఁడై, అడిగినయట్టి, యాచకులయాశలు=అర్థుల కోరికలు, ఎఱుంగక=తెలిసికొనక, కడపినన్=పొమ్మని పంపినచో, ఒకానొకప్పుడు, వానికిన్=ఆలోభివానికి, ధర్మదేవత=ధర్మమనెడుదైవము, ఎయ్యెడలన్=ఏచోటను, ఈదు=సంపద నీయదు. అదెట్లు=అది యేలాగునంటే, లేఁగలన్=దూడలను, కుడువగనీనిచోన్=పాలు త్రాగనీయనియెడల, గోవులు=ఆవులు, కెరలి=కోపించి, తన్నునుగాక=తన్నునుగాని, పాలు=పాలను, తమకున్=తమకు, ఎచ్చటనైన=ఏతావునందైన, ఇచ్చునె=ఇచ్చునా? (ఇవ్వవని యర్థము)

తా. మనుష్యుఁడు దూడలను త్రాగనీయకుండా పాలు పిండుకొనదలచినచో, ఆవులు కోపించి తన్నుచు పాలీయవు. అట్లే మానవుఁడు లోభియై యడిగిన యాచకుల కోర్కెల దీర్పక పొమ్మని పంపినచో, వాని కెచ్చటను ధర్మదేవత సంపద నీయదు.

చ. అతిగుణహీనలోభికిఁ బదార్థము గల్గిన లేకయుండినన్
మితముగఁ గాని కల్మిగల మీఁదటనైన భుజింపఁ డింపుగా
సతమని నమ్మ దేహమును సంపద నేఱులు నిండి పాఱినన్
గతుకగఁ జూచుఁగుక్కతనకట్టడమీఱక యెందు భాస్కరా.

టీ. భాస్కరా! అతిగుణహీనలోభికిన్=మంచిగుణములు మిక్కిలి తక్కువైన లోభివానికి, పదార్థము=సంపద, కల్గినను=ఉన్నను, లేకయుండినన్=లేకపోయినను, మితముగన్=తక్కువగనే, కాని, కల్మిగలమీఁదట

నైనన్=సంపద గలిగిన తరువాతయైన, ఇంపుగా=బాగుగా, భుజింపఁడు=తినఁడు. దేహమును=శరీరమును, సంపదన్=భాగ్యమును, సతమని=శాశ్వతమని, నమ్మెన్=నమ్మెను. (ఎట్లనగా) ఏఱులు=నదులు, నిండిపాఱినన్=పూర్ణమైన జలముతోఁ బ్రవహించినను, కుక్క, ఎందున్=ఎక్కడనైనను, తనకట్టడన్=తన నియమమును, మీఱక=తప్పక, కతుకఁగన్ చూచున్=నాలుకతో నందుకొని త్రాగుటకే చూచును.

తా. ఏఱులు జలముతో నిండి ప్రవహించుచున్నను కుక్క తన యలవాటు తప్పక నాలుకతోడనే త్రాగునుగాని, బాగుగా త్రాగదు. అట్లే లోభివాడు తనకు సంపదయున్నను, లేకున్నను మితముగానే తినును. శరీరము సంపద శాశ్వత మనుకొని సంపద యున్నప్పుడైనను బాగుగా భుజింపడు.

చ. అదను దలంచి కూర్చి ప్రజ నాదరమొప్ప విభుండు కోరినన్
గదిసి పదార్థ మిత్తు రటు కానక వేగమె కొట్టి తెం డనన్
మొదటికిమోసమౌఁబొదుగు మూలముఁగోసినబాలుగల్గునే
పిదికినఁగాక భూమిఁ బశుబృందము నెవ్వరి కైన భాస్కరా.

టీ. భాస్కరా! విభుండు=రాజు, అదను=సమయమును, తలంచి=ఆలోచించి, కూర్చి=ఆనందింపఁజేసి, ప్రజన్, ఆదరమొప్పన్=గౌరవమొప్పునట్లుగా, కోరినన్, కదిసి=రాజును సమీపించి, పదార్థము=ధనము, ఇత్తురు, అటుకానక=అది తెలియక, వేగమె, కొట్టి, తెండనన్, మొదటికి, మోసమౌ, (ఎట్లనగా) భూమిన్, పశుబృందమున్=ఆవులగుంపును, పిదికినగాక, పొదుగుమూలమున్=పొదుగు మొదటిభాగమును, కోసినన్, ఎవ్వరికైనన్, పాలుగల్గునే=పాలువచ్చునా? (రా వనిభావము)

తా. ఆవులను మచ్చికతోఁ బిదికిన పాలు వచ్చునుగాని, పొదుగు మొదటిభాగముఁ గోసిన, యెవ్వరికైనను పాలు రాకుండుటయేగాక మొద

టికి మోసము గలుగును. అటులనే రాజు ప్రజలను సమయము నాలోచించి గౌరవించి యడిగిన ధనమిత్తురు గాని, వేగమే బాధించి తెమ్మనినచో, నేమియు నీయక విడిచి పోవుదురు.

చ. అనఘునికైనఁ జేకుఱు ననర్హుని గూడి చరించినంతలో
మన మెరియంగ నప్పు డవమానము కీడు ధరిత్రియందు నే
యనువుననైనఁ దప్పవు యదార్థము; తానది యెట్టులన్నచో
నినుమునుగూర్చియగ్నినలయింపదెసమ్మెటపెట్టుభాస్కరా.

టీ. భాస్కరా! ధరిత్రియందున్=భూమియందు, అనర్హుని=అయోగ్యుని, కూడి, చరించినంతలోన్=తిరిగినంతమాత్రమున, మనము=మనస్సు, ఎరియంగన్=మండునట్లుగా, అప్పుడు, అవమానము, కీడున్=చెడుగును, అనఘునికైనన్=పాపము లేనివానికైనను, చేకురున్=కలుగును. ఏయనువుననైనన్ = ఏయుపాయము చేత నయినను, తప్పవు, యదార్థము=నిజము. తాన్ + అది + ఎట్టులు-అన్నచోన్, సమ్మెటపెట్టు=సుత్తిదెబ్బ, ఇనుమునుగూర్చి = ఇనుముతో చేరుటవలన, అగ్నిన్ = నిప్పును, అలయింపదె = బాధింపదా?

తా. ఇనుముతో చేరుటవలన నిప్పునకు సుత్తిదెబ్బల బాధ కలుగునట్లు, చెడ్డవానితో స్నేహము చేసిన మంచివారికైన మనస్సుమండునట్లు అవమానమును, కీడును తప్పక కలుగును.

చ. అలఘుగుణ ప్రసిద్ధుఁ డగునట్టిఘనుం డొకఁడిష్టుఁడై తనున్
వలచి యొకించుకేమిడిన వానికి మిక్కిలి మేలు చేయుగా
తెలిసి కుచేలుఁడొక్కకొణిదెండడుకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁడత్యధికభాగ్యములాతనికీఁడె భాస్కరా.

టీ. భాస్కరా! అలఘుగుణప్రసిద్ధుడు=గొప్పవగు గుణములచే విఖ్యాతిఁబొందినవాఁడు, అగునట్టిఘనుండు=అయిన గొప్పవాఁడు, ఒకఁడు, ఇష్టుఁడు + ఐ=స్నేహితుఁడై, తనున్, వలచి=ప్రేమించి, ఒకించుక=కొంచెము, ఏమిడినన్=ఏమిచ్చినను, వానికిన్, మిక్కిలి, మేలు, చేయఁగా=చేయును గదా, తెలిసి, కుచేలుఁడు, ఒక్కకొణిగెండు=ఒకచేరెఁడు, అటుకుల్, తనకున్, ఇచ్చినన్, మహాఫలదుఁడు=గొప్పఫలము నిచ్చునట్లు, కృష్ణుఁడు=శ్రీకృష్ణభగవానుఁడు, అతనికిన్=ఆ కుచేలునకు, అత్యధికభాగ్యములు=గొప్పసంపదలు, ఈఁడె=ఈయలేదా? (ఇచ్చెనని భావము)

తా. శ్రీకృష్ణభగవానునకు కుచేలుఁడు భక్తితోఁ జేరెఁడటుకు లీయగా ఆకుచేలునకు గొప్పసంపద లిచ్చెను. అటులనే ప్రఖ్యాతిగల గుణవంతుఁడు తనకు స్నేహితుఁడైనవాడు తనమీఁది ప్రేమచే తన కేమిచ్చినను, వాని కధికఫలమునే యిచ్చును.

పూర్వగాథ;—కుచేలుఁడు బీదబ్రాహ్మణుఁడు. కాశీపురమున బలరామకృష్ణులతో సాందీపునిదగ్గఱ చిన్నతనములో చదువుకొనెను. ఇతనికిరువదియేడుగురు పుత్రులు. నిరుపేద యగుటచే భార్యయగు వామాక్షి ప్రేరేపణమున బాల్యమిత్రుఁడగు శ్రీకృష్ణుని సందర్శించి గుప్పెడటుకుల నీయఁగా కృష్ణుఁ డీతని కత్యధిక భాగ్యముల నిచ్చెను.

చ. అవనివిభుండు నేరుపరియై చరియించినఁ గొల్చువార లె
ట్లవగుణులైన నేమి బనులన్నియుఁ జేకుఱు వారిచేతనే
ప్రవిమలనీతిశాలియగు రామునికార్యము మర్కటంబులే
తవిలి యొనర్పవే? జలధిదాటిసురారులఁ ద్రుంచి భాస్కరా.

టీ. భాస్కరా! అవనివిభుండు=రాజు, నేరుపరియై=నిపుణత కలవాఁడై, చరియించినన్=సంచరించినయెడల, కొల్చువారలు=సేవకులు, ఎట్లు అవగుణులు=చెడుగుణము కలవారు, ఐన నేమి, వారిచేతనే, పనులన్నియున్

చేకుఱు=సమకూడును. ఎట్లనగా, పరిమల నీతిశాలి=ప్రసిద్ధమైన నీతిచే ప్రకాశించువాఁడు, అగు; రామునికార్యము=శ్రీరాముని పని, మర్కటంబులే=కోఁతులే, తవిలి=పూనుకొని, జలధిన్ = సముద్రమును, దాఁటి, సురారులన్=రాక్షసులను, త్రుంచి=చంపి. ఒనర్పవే = చేసినవి కావా? (చేసినవని యర్థము)

తా. ప్రసిద్ధమైన రాజనీతిగల రాముని కార్యమును కోఁతులేపూనుకొని సముద్రమును దాఁటి రాక్షసులను చంపి, నెఱవేర్చినవి. అటులనే, రాజు నేర్పరి అయినయెడల సేవకు లెట్టివారలైనను పనులు నెఱవేరును.

పూర్వగాథ:— అరణ్యవాసము చేయుచున్న శ్రీరాముని మోసగించి ఆయనభార్యయగు సీతను రావణుఁడు చెఱబట్టి తనలంకలో నుంచెను. రాజనీతిగల రాముఁడు కోఁతుల సహాయమున సముద్రమునకు వారధి గట్టి రావణుని బంధుమిత్ర భృత్యులతో సంహరించి సీతను గైకొని అయోధ్యకు వెళ్ళి సుఖముగా నుండెను.

ఉ. ఆదర మింతలేక నరుఁ డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము చేయుటం దనదు పేర్మికిఁ గీడగు మూలమె ట్లమ
ర్యాదహిరణ్యపూర్వకశిపన్ దనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర
హ్లాదునకెగ్గుచేసి ప్రళయంబునుబొందఁడె మున్ను భాస్కరా.

టీ. భాస్కరా! నరుఁడు, ఆదరము=ప్రేమ, ఇంతలేక=కొంచెమైనను లేక, ఆత్మబల + ఉన్నతి=తన యొక్క బలమువలన, మంచివారికిన్, భేదము=బాధ, చేయుటయున్, తనదు పేర్మికిన్=తనయొక్క వృద్ధికి, కీడు + అగున్. మూలము=కారణము, ఎట్లు=ఏలాగనిన, మున్ను=పూర్వము, అమర్యాదన్ = చెడునడవడిచేత, హిరణ్యపూర్వకశిపు + అన్=హిరణ్యకశిపుఁడను, దనుజుండు=రాక్షసుఁడు, గుణాఢ్యుఁడైన=మంచిగుణములు గలవాఁ

డైన, ప్రహ్లాదునకు, ఎగ్గుచేసి=అపకారముఁజేసి, ప్రళయంబున=నాశమును, పొందఁడె=పొందలేదా? (పొందెనని భావము)

తా. తొల్లి చెడ్డవృత్తిచే హిరణ్యకశిపుఁడు గుణవంతుఁడగు ప్రహ్లాదునకపకారముచేసి నశించెను. అటులనే మనుష్యుఁడు తన గొప్పబలముచేత కొంచెమైనను ప్రేమలేక మంచివారిని బాధించినచోఁ దప్పక నశించును.

పూర్వగాథ:- సనకసనందనాదుల శాపముచేత విష్ణుద్వారపాలకులగు జయవిజయులు కశ్యపునకు దితియందు హిరణ్యకశిప హిరణ్యాక్షులై పుట్టిరి. వీరు గొప్ప తపస్సుచేసి బ్రహ్మవలన అనేకవరములు పొంది గర్వించుచుండిరి. హిరణ్యాక్షుడు భూమిని చుట్టుచుండ హరి వరాహరూపమున వానిని చంపెను. హిరణ్యకశిపుఁడు హరిపై ద్వేషముగలిగి లోకకంటకుడై యుండెను. ఈతని భార్యయగు లీలావతియందు ప్రహ్లాదుఁడు జన్మించెను. ప్రహ్లాదుఁడు హరిభక్తుఁడై హరినామస్మరణము చేయుచుండెను. హిరణ్యకశిపుడందులకు కోపించి కుమారుని జంపింప ననేక యుపాయములు పన్ని నిష్ఫలుఁడై తానే స్వయముగా కుమారుని జంపింప నుంకించియుండగా శ్రీహరి నరసింహ రూపముతో నుక్కుస్తంభమునం దుద్భవించి హిరణ్యకశిపుని సంహరించెను.

ఉ. ఆరయ నెంత నేరుపరియై చరియించిన వాని దాపునన్
గౌరవ మొప్పఁగూర్చు నుపకారిమనుష్యుఁడు లేక మేలుచే
కూఱదదెట్లు? హత్తుగడగూఁడునె చూడఁ బదాఱువన్నె బం
గారములోననైన వెలిగారము గూడకయున్న భాస్కరా.

టీ. భాస్కరా! ఆరయన్=ఆలోచింపఁగా, (మనుజుఁడు) ఎంతనేరుపరి, ఐ చరియించినన్, వానిదాపునన్=వానిదగ్గఱ, గౌరవము=ఘనత, ఒప్పన్=తగునట్లుగా, కూర్చు+ఉపకారి మనుష్యుఁడు లేక మేలు, చేకూరదు=కలుగదు, అది+ఎట్లు=అదేలాగునంటే, చూడన్=విచారింపఁగా,

పదాఱువన్నె బంగారములోనన్ + ఐన=మేలిమిబంగారులోనైనను, వెలిగారము కూడకయున్నన్ = కలియకున్నచో, హత్తుగడ=అతుకు, కూడునె=అంటుకొనునా? (అంటుకొనదు)

తా. మేలిమిబంగారములో నైనను వెలిగారము కలియకున్నచో అతుకు అంటుకొనదు. అటులనే మనుజుఁ డెంతనేర్పరియైనను వానిదగ్గఱ ఘనతను గలుగఁజేయు నుపకారి మనుష్యుఁడు లేనిచో మంచికలుగదు.

ఉ. ఈక్షితి నర్థకాంక్ష మది నెప్పుడు పాయక లోకులెల్ల సం
రక్షకుఁడైన సత్ప్రభుని రాకలఁ గోరుదు రెందుఁ జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁ డుదయించువిధంబునకై చకోరపుం
బక్షులు చూడవే యెదు రపార ముదంబునుఁ బూని భాస్కరా.

టీ. భాస్కరా! ఈక్షితిన్=ఈభూమియందు, లోకులు + ఎల్లన్=మనుష్యులందరును, అర్థకాంక్షన్ = ధనమునందలి యాశను, ఎప్పుడు, పాయక=విడువక, సంరక్షకుఁడు=తమ్మురక్షించువాఁడు, ఐనసత్ + ప్రభుని రాకలు=అయినట్టి మంచిరాజు, వచ్చుటలను, ఎందున్=ఏవేళలయందైనను, కోరుదురు. ఎట్లనన్, చకోరపుంబక్షులు=వెన్నెలపిట్టలు, చంద్రిక + అపేక్షన్=వెన్నెలయందలి యాసక్తిచే, చెలఁగి=సంతోషపడి, చంద్రుఁడు, ఉదయించువిధంబునకు + ఐ = పుట్టుటకయి, అపారముదంబును=హద్దులేని సంతోషమును; పూని=పొంది, ఎదురుచూడవే=కనిపెట్టుకొనియుండవా? (ఉండునని యర్థము)

తా. వెన్నెలపిట్టలు వెన్నెలయందలి యాసక్తిచేత మిక్కిలి సంతోషమును పొంది చంద్రోదయమునకై ఎదురుచూచుచుండును. అటులనే మానవులు ధనమునందలి యాశచే దమ్ము కాపాడునట్టి మంచిరాజు రాకకై ఎదురుచూచుచుందురు.

విశేషాంశము;—చకోరము=చంద్రికిరణములను దినునది. చక్రవాకము=సూర్యకిరణములను దినునది.

ఉ. ఈజగమందుఁ దామనుజుఁడెంత మహాత్మకుఁడైనఁ దైవమా
తేజముతప్పఁ జూచునెడఁ ద్రిమ్మరి కోల్పడు; నెట్లనన్మహా
రాజకుమారుఁడై నరఘురాముఁడుగాల్నడఁగాయలాకులున్
భోజనమై తగన్వనికిఁ బోయి చరింపఁడె మున్ను భాస్కరా

టీ. భాస్కరా! మనుజుఁడు, తాన్, ఈజగమందు, ఎంతమహాత్మకుడు=ఎంతగొప్పవాఁడు, ఐనన్, దైవము, ఆతేజము=ఆగొప్పను, తప్పన్=తప్పునట్లుగా, చూచునెడన్—చూచునట్టి సమయమునందు, త్రిమ్మరి=దేశసంచారియయి, కోల్పడున్=పోఁగొట్టుకొనును. ఎట్లనన్, మున్ను, మహారాజకుమారుఁడు, ఐనరఘురాముఁడు=అయినట్టి రామచంద్రుఁడు, కాయలు, ఆకులు, భోజనమై=ఆహారమయి, తగన్=తగునట్లు, కాల్నడన్=కాలి నడకతో, వనికిన్=అడవికి, పోయి, చరింపఁడె=తిరగఁడా? (తిరిగెను)

తా. పూర్వము దశరథమహారాజ కుమారుఁడైన రామచంద్రుఁడు కాలినడకతో నడవికేఁగి, ఆకులు కాయలు నాహారముగఁ జేసికొని, తిరుగవలసి వచ్చెను. అటులనే మనుజుఁడు తా నెంత గొప్పవాఁడయినను, దైవానుగ్రహము లేనియెడల, ఆగొప్పఁ బోఁగొట్టుకొని దేశసంచారియైతిరుగును.

చ. ఉరుకరుణాయుతుండుసమయోచితమాత్మదలంచియుగ్రవా
క్పరుషతఁజూపినన్ ఫలముగల్గుట తథ్యముగాదె యంబుదం
బురిమినయంతనే కురియ కుండునె వర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున నశేషజనంబు లెఱుంగ భాస్కరా.

టీ. భాస్కరా! ఉరుకరుణాయుతుండు=గొప్పదైన దయతోఁ గూడినవాఁడు, సమయోచితము=కాలమునకుఁ దగిన యాలోచన, ఆత్మన్=మనస్సు, తలంచి, ఉగ్ర + వాక్ + పరుషతన్=భయంకరమగు మాటలయొక్క కాఠిన్యమును, చూపినన్, ఫలము—లాభము, కల్గుట, తథ్యముగాదె=నిజమే

కదా? ఎట్లనన్, అంబుదంబు=మేఘము, ఉరిమినయంతనే, లోక=జనులను, రక్షణ=రక్షించుటయందు, స్థిరతర=మిక్కిలి స్థిరమైన, పౌరుషంబునన్= శౌర్యముచేత, అశేషజనంబులు=జనులందరును, ఎఱుంగన్, వర్షము, కురియక, ఉండునె=ఉండునా? (ఉండదని యర్థము)

తా. మేఘుఁడు ప్రారంభమున భయము గలుగున ట్లురిమి వెంటనే జనులను రక్షించు పట్టుదలతో నందరికి నానందము గలుగునట్లు వర్షించును. అటులనే గొప్పదయగల్గినవాఁడు సమయానుకూలముగా కఠినవాక్యము లాడినను తరువాత తప్పక మేలుగలిగించును.

చ. ఉరుగుణవంతుఁ డొడ్లు దనకొండపకారము సేయునప్పుడున్
బరహితమే యొనర్చు నొకపట్టుననైనను గీడుఁ జేయఁగా
నెఱుఁగఁడు నిక్కమేకదయ దెట్లనఁ గవ్వముఁ బట్టి యెంతయున్
దరువఁగఁ జొచ్చినం బెరుఁగు తాలిమినీయదె వెన్న భాస్కరా.

టీ. భాస్కరా! ఒడ్లు=ఇతరులు, తనకున్, ఒండు=ఒక, అపకారము=కీడు, చేయునప్పుడున్=చేయుసమయమందును, ఉరుగుణవంతుఁడు= గొప్పగుణములు గలవాఁడు, పరహితము + ఏ=ఇతరులకు మేలునే, ఒనర్చున్=చేయును. ఒకపట్టునన్ + ఐనను=ఒకసమయమునందైనను, కీడున్, చేయన్ + కాన్ = ఒనర్చుటను, ఎఱుఁగఁడు, నిక్కము + ఏకద=నిజమే కదా, అదెట్లనన్, పెరుఁగు, కవ్వమున్, పట్టి=చేతఁగొని, ఎంతయున్= మిక్కిలి, తరువగన్ + చొచ్చినన్ = చిలుకుచున్నను, (పెరుఁగుకర్త) తాలిమిన్=ఓర్పుచే, వెన్నన్, ఈయదె=ఈయదా? (ఇచ్చునని భావము)

తా. పెరుఁగు, మానవులు తన్ను గవ్వముచేఁగొని యెంత చిలుకుచున్నను, యోర్చి వారికి వెన్ననిచ్చును. అటులనే గుణవంతుఁడు తనకుఁ బరులు కీడుచేయుచున్నను, వారి కపకారము చేయక తాను పరోపకారమే చేయును.

చ. ఉరుబలశాలి నంచుఁ దను నొల్లని యన్యపతివ్రతాంగనా
సురతము గోరెనేని కడ సుమ్మది భూతికిఁ బ్రాణహానియౌ
శిరములు గూల రాఘవునిచే దశకంఠుఁడు ద్రుంగిపోవఁడే
యెఱుఁగక సీతకాసపడి యిష్టులభృత్యులఁగూడి భాస్కరా.

టీ. భాస్కరా! (మానవుఁడనునది తెచ్చి పెట్టుకోవలెను.) ఉరుబల శాలిన్ + అంచు=గొప్పబలము గలవాఁడనని, తనున్, ఒల్లని=ఒప్పుకొనని, అన్య=ఇతర, పతివ్రతా + అంగనా=పాతివ్రత్యముగల స్త్రీయొక్క, సురత మున్=సంగమమును, కోరెన్, ఏని,అది, భూతికిన్=సంపదకు, కడసుమ్మ= అంతమేసుమా! ప్రాణహాని, ఔను, ఎట్లనిన, దశకంఠుఁడు=పదితలలుగల రావణుఁడు, ఎఱుఁగక, సీతకున్, ఆసపడి, ఇష్టులన్=హితులను, భృత్యు లన్=సేవకులను కూడి, రామునిచే, శిరములు, కూలన్=తెగునట్లు, త్రుంగి పోవఁడే=చావఁడా! (చచ్చెను)

తా. రావణుఁడు చేటెఱుఁగక సీతామహాదేవినిఁ గోరి, బంధుభట సమేతుఁడై రామునిచేత సంహరింపబడెను. అటులనే మానవుఁడు బలశాలి నని గర్వించి తన్ను నొల్లని పరవనితను గవయఁగోరిన, సంపదహానియు, ప్రాణహానియు సంభవించును.

పూర్వగాథ;—పులస్త్యుని కొడుకగు విశ్రవసునకు సుమాలికూతురగు కైకసియందు రావణుఁడు జన్మించెను. మయుని కూతురగు మండోదరి యాతనిభార్య. కుంభకర్ణ విభీషణు లీతని తమ్ములు. ఈతఁడు లోకకంటకుఁ డగుటచే సురలు హరిని ప్రార్థింప శ్రీహరి రాముఁడై పుట్టి తండ్రియానతిని భార్యయగు సీతతోడను, తమ్ముడగు లక్ష్మణునితోడను వనవాసము చేయు చుండగా రావణుఁడు సీతను చెఱపట్టెను. రాముఁడు లంకలోనికి వెళ్ళి, రావణుని బంధుమిత్ర పుత్రసమేతముగా సంహరించెను. రావణకుంభకర్ణులే శాపగ్రస్తులయిన జయవిజయులు రెండవజన్మమువారు.

ఉ. ఊరక వచ్చుఁబాటుపడకుండిననైన ఫలంబదృష్టమే
పారఁగఁగల్గువానికిఁ బ్రయాసము నొందిన దేవదానవుల్
వార లటుండఁగా నడుమ వచ్చిన శౌరికిఁ గల్గెఁగాదె శృం
గారపుఁబ్రోవులక్ష్మియునుగౌస్తుభరత్నము రెండుభాస్కరా.

టీ. భాస్కరా! అదృష్టము=పురాకృతపుణ్యము, ఏపారఁగన్=వృద్ధి కలుగునట్లు, కల్గువానికిన్, పాటుపడకుండినన్, ఫలంబు=లాభము, ఊరక, వచ్చున్, ఎట్లనఁగా, ప్రయాసమున్=కష్టమును, ఒందిన దేవదానవుల్= పొందిన దేవతలు రాక్షసులును, వారలు, అటుండఁగా, శృంగారపుఁ బ్రోవు=సొబగుల కుప్పయగు, లక్ష్మియును, కౌస్తుభరత్నము, రెండున్, నడుమన్=మధ్యను, వచ్చిన, శౌరికి=విష్ణువునకు, కల్గెన్ + కాదె=నొర కెనుగదా!

తా. సముద్రమును చిలుకునపుడు కష్టపడిన దేవతలు, రాక్షసులు నుండగా నడుమవచ్చిన శ్రీవిష్ణువునకు శృంగారవతియగు లక్ష్మీదేవియును కౌస్తుభరత్నమును లభించెను. అటులనే గొప్పయదృష్టవంతునకు పాటుపడ నక్కఱలేకయే ఫలము లభించును.

పూర్వగాథ:—దేవతలు, రాక్షసులు, పాలసముద్రమును కుండగను వాసుకియను పామును త్రాడుగను, మందరపర్వతమును కవ్వముగను జేసి, యమృతము కొఱకును చిలుకుచుండగా, అమృతము పుట్టకముందు హాలాహలమనువిషము, తరువాత దివ్యములగు వస్తువులు పుట్టినవి. వానిలో లక్ష్మీదేవిని కౌస్తుభరత్నమును శ్రీవిష్ణువు సంగ్రహించెను.

ఉ. ఊఱక సజ్జనుం డొదిగియుండిన నైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యుపకారము చేయుట వానివిద్యగా

చీరెలు నూరుటంకములు చేసెడివైనను బెట్టెనుండఁగా
జేరి చినింగిపోఁ గొఱుకు చిమ్మట కేమిఫలంబు? భాస్కరా.

టీ. భాస్కరా! సజ్జనుండు=మంచివాఁడు, ఊరక, ఒదిగి=అడఁగి, ఉండినన్ + ఐనన్ = ఉన్నప్పటికిని, దురాత్మకుండు = చెడ్డమనస్సుగలవాఁడు, నిష్కారణము=కారణములేకుండ, ఓర్వలేక, అపకారము=చెడుపని, చేయుట, వానివిద్యకా=వానిచేతనైన పనిగదా! ఎట్లనిన, చీరెలు=బట్టలు, నూఱుటంకములు=నూఱేసి మొహరీలు, చేసెడివి=విలువగలవి, అయినను, పెట్టెన్=పెట్టెలో, ఉండఁగాన్, చేరి=వానిలో ప్రవేశించి, చినింగిపోన్=ఆబట్టలు చినిఁగిపోవునట్లు, కొఱుకుచిమ్మటకు = కొఱికెడు చిమ్మటకు, ఏమిఫలంబు=లాభమేమున్నది. (లేదు)

తా. బట్టలు నూఱేసి మొహరీలు విలువగలవైనను, పెట్టెలో నుండినప్పటికిని, చిమ్మటపురుగు తనకేమి లాభములేకపోయినను వాటిదగ్గరకు జేరి ముక్కలుగా కొఱుకును. అటులనే మంచివాఁడు యూరక యొదిగియుండినను చెడ్డవాఁడు కారణములేకుండగనే యోర్వలేక మంచివానికపకారము చేయుచుండును.

ఉ. ఎట్టుగఁ బాటుపడ్డ నొకయించుకప్రాప్తము లేక వస్తువుల్
పట్టుపడంగనేరవు, నిబద్ధి సురావళిఁ గూడి రాక్షసుల్
గట్టుపెకల్చి పాల్కడలిఁ గవ్వముచేసి మథించి రంతయున్
వెట్టియెకాక యే మనుభవించిరి వారమృతంబు? భాస్కరా.

టీ. భాస్కరా! ఎట్టుగన్=ఏవిధముగా, పాటుపడ్డన్=శ్రమపడినను, ఒకయించుక=కొంచెమేని, ప్రాప్తములేక=అదృష్టములేక, వస్తువుల్, పట్టుపడంగనేరవు=లభింపజాలవు, నిబద్ధి=సత్యమే, ఎట్లనిన, రాక్షసుల్, సురావళిన్=దేవతాసమూహముతో, కూడి=కలసి, గట్టు=(మందర) పర్వతమును,

పెకల్చి=ఊడఁదీసి, కవ్వము చేసి, పాల్కడలిన్=పాలసముద్రమును, మథించిరి=చిలికిరి. అంతయున్=వీరుపడిన కష్టమంతయును, వెట్టియె కాక=ఫలము లేనిదే కాని, వారు=ఆరాక్షసులు, అమృతంబును, ఏమి + అనుభవించిరి= ఏమి త్రాగినారు? (త్రావలేదని భావము)

తా. రాక్షసులు దేవతలతో స్నేహము చేసి మందరగిరిని ఊడఁదీసి, దెచ్చి కవ్వముగాఁ జేసి పాలసముద్రమును చిలికిరి. వీరి పడిన కష్టమంతయు వెట్టియే కాని యమృతమేమియును ద్రావలేదు. అటులనే మానవు డెంతకష్ట పడినను దాననుభవింపఁదగిన యదృష్టము లేకపోయినచో ఫలము దొరకదు.

పూర్వగాథ;—దేవదానవులు పాలసముద్రమును మథించఁగా అమృతము పుట్టెను. దానిని శ్రీవిష్ణువు జగన్మోహినీరూప మెత్తి యిరుతెగల వారలకు పంచెదనని దేవతలకే యమృతమును పంచిపెట్టి రాక్షసులకు లేకుండగా జేసెను.

చ. ఎడపక దుర్జనుండొరుల కెంతయుఁగీడొనరించుఁగాని యే
యెడలను మేలుసేయఁ డొకయించుకయైనను, జీడపుర్వుడాఁ
జెడఁ దిను నింతెకాక పుడిసెండుజలం బిడి పెంపనేర్చునే
పొడవగుచున్న పుష్పఫలభూరుహ మొక్కటినైన భాస్కరా.

టీ. భాస్కరా! దుర్జనుండు=చెడ్డవాఁడు, ఎడపక=విడువక, ఒరులకున్=పరులకు, ఎంతయున్, కీడు, ఒనరించున్, కాని, ఏయెడలను=ఏసమయమునందైనను, ఒకయించుకయైనను=కొంచెమేనియును, మేలు, చేయఁడు, ఎట్లనఁగా, చీడపుర్వు=చీడపురుగు, తాన్, చెడన్ = పాడగునట్లుగా, తినున్=ఫలవృక్షములను తినును గాని, పుడిసెండుజలంబు=చేరెఁడు నీళ్ళను, ఇడి=పోసి, పొడవు + అగుచున్న, పుష్పఫలభూరుహమున్ = పూవులు కాయలుగల వృక్షమును, ఒకటిన్, ఐనన్, పెంపన్ + నేర్చునే=పోషింపగలదా? (లేదని భావము)

తా. చీడపురుగు చక్కగా పెరుగుచున్న పూవులు కాయలు గల చెట్లను పాడగునట్లు తినునేగాని, చేరెడు నీళ్ళనుపోసి పెంచలేదు. అట్లానే దుర్జనుఁడు పరుల కెంతయో హానిచేయునేగాని ఏసమయమునం దైనను కొంచెమైనను మేలు చేయఁడు.

ఉ. ఎడ్డెమనుష్యుఁ డేమెఱుఁగు నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గలతోరపువర్తనలెల్లఁ బ్రజ్ఞచేఁ
దొడ్డవివేకిరీతి; రుచిపాకము నాలుకగాకెఱుంగునే?
తెడ్డది కూరలోఁ గలయఁద్రిమ్మరుచుండిననైన భాస్కరా.

టీ. భాస్కరా! ఎడ్డెమనుష్యుఁడు = మూఢుఁడు, ఎన్నిదినంబులు, కూడియుండినన్, దొడ్డగుణ + ఆఢ్యునందున్ = మంచిగుణములు గలవాని యందు, కల=ఉన్నట్టి, తోరపువర్తనలు + ఎల్లన్ = మంచివైన నడతలన్నియును, ప్రజ్ఞన్=తెలివిచే, పేరు + వడ్డవివేకికీతిన్=ఖ్యాతి గాంచిన జ్ఞానవంతునివలెను, ఏమి, ఎఱుఁగున్? (తెలిసికొనలేఁడు) ఎట్లనిన, రుచిపాకము=రుచియొక్క పరిపాకము, నాలుకగాని, తెడ్డు=కలియఁబెట్టు గరిటె, కూరలోన్, కలయన్=అంతటను, దిమ్మరుచున్ = తిరుగుచున్నప్పటికిని, అది=ఆతెడ్డు, ఎఱుంగునే=రుచిని తెలిసికొనజాలునా? (తెలిసికొనలేదు)

తా. కూరలయొక్కరుచిని నాలుక తెలిసికొనునుగాని, యెల్లప్పుడు కూరలలోఁ దిరుగుచున్నను, తెడ్డారుచిని తెలిసికొనలేదు అటులనే గుణవంతునియందలి మంచినడతలు తెలివిచే ప్రసిద్ధికెక్కిన జ్ఞాని తెలిసికొనును గాని, ఆ గుణవంతునితో యెన్నిదినములు కలిసి తిరిగినను మూఢుఁడు తెలిసికొనలేఁడు.

ఉ. ఎప్పు డదృష్టతామహిమ యించుక పాటిలునప్పుడింపుసొం
పొప్పుచునుండుఁగాకయదియొప్పనిపిమ్మటరూపుమాయుఁగా

నిప్పున నంటియున్న యతినిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకుఁ దా నలు పెంతయుఁ బుట్టు భాస్కరా.

టీ. భాస్కరా! ఎప్పుడు=ఏ సమయమున, అదృష్టతామహిమ=అదృష్టముయొక్క పెంపు, ఇంచుక=కొంచెము, పాటిలుఁ=కలుగునో, అప్పుడు, ఇంపుసొంపు=చక్కదనముయొక్క యతిశయము, ఒప్పుచునుండుఁగాక=ప్రకాశించుచుండునుగాని, అది=ఆయదృష్టము, ఒప్పనిపిమ్మటఁ=తొలగిన వెనుక, రూపు=తొలుతటిరూపము, మాయుఁగా=చెడునుగదా, ఎట్లనఁ, నిప్పునన్=అగ్నియందు, అంటియున్న, అతినిర్మలిన=మిక్కిలిస్వచ్ఛమైన, అగ్ని, గురుప్రకాశముల్=గొప్పవగుకాంతులు, తప్పినఁ, అట్టిబొగ్గునకుఁ=అటువంటిమసిబొగ్గునకు, నలుపు, తాన్=తాను, ఎంతయున్, పుట్టుఁ=కలుగుచుండును.

తా. బొగ్గు అగ్నితో చేరియున్నప్పుడు దానియందలి స్వచ్ఛమైనకాంతులతో ప్రకాశించును. అగ్నిసంబంధము తొలఁగిపోయినచో తొల్లిటికాంతులుతప్పి మిక్కిలి నలుపుపుట్టును. అట్లేమానవు డదృష్టమువృద్ధియగునపుడు ప్రభగల్గియుండునుగాని అదివిడిచిపోయినతరువాత తొల్లిటిప్రభనశించును.

ఉ. ఏగతిఁ బాటుపడ్డఁ గలదే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖ గలపుణ్యునకుంబలె? భూరిసత్త్వసం
యోగమదేభకుంభయుగళోత్థితమాంసము నక్కకూన కే
లాగుఘటించు సింహము దలంచినఁ జేకుఱుఁగాక భాస్కరా.

టీ. భాస్కరా! ఏగతిఁ = ఏవిధముగా, పాటుపడ్డఁ = కష్టపడుచున్నను, భువిన్=భూమియందు, అల్పునకుఁ=నీచునకు, భాగ్యరేఖ=అదృష్టలక్షణము, కలపుణ్యునకుంబలెన్, సమగ్రతాభోగము = సంపూర్ణసౌఖ్యము, కలదే=కలదా? (ఎట్లనిన) భూరిసత్త్వ=ఘనమైన బలముచేత,

సంయోగ=కూడుకొనబడిన, మద + ఇభ=మదపుటేనుఁగుయొక్క, కుంభ యుగళ=రెండుకుంభస్థలములందును, ఉత్ + స్థిత=పుట్టిన, మాంసము, సింహము, తలంచినన్, చేకుఱుఁగాక=లభించునుగాని, నక్కకూనకున్=నక్క పిల్లకు, ఏలాగు, ఘటించున్=లభించును? (దొరుకదు.)

తా. మదపుటేనుఁగుయొక్క కుంభస్థలముయందున్న మాంసమును సింహము కోరినచో దొరుకునుగాని, యెంతశ్రమపడినను నక్కపిల్లకు దొరకదు. అటులనే సంపూర్ణమైన సౌఖ్యము అదృష్టవంతునకు దొరుకును గాని యెంతశ్రమపడినను అల్పునకు దొరుకదు.

ఉ. ఏడ ననర్హుఁడుండు నటకేఁగు ననర్హుఁడు నర్హుఁడున్నచోఁ
జూడఁగనొల్లఁ డెట్లన నశుద్ధగుణస్థితి నీఁగ పూయముం
గూడినపుంటిపై నిలువఁగోరినయట్టులు నిల్వనేర్చునే
నూడిదవెట్టు నెన్నుదుటి చొక్కపుఁగస్తురిమీఁదభాస్కరా.

టీ. భాస్కరా! అనర్హుఁడు=అయోగ్యుఁడు, ఏడనుండున్=ఎక్కడ నుండునో, అనర్హుఁడు=అయోగ్యుడు, అటకున్=అచోటికి, ఏఁగున్=వెళ్ళును. అర్హుఁడు=యోగ్యుడు, ఉన్నచోన్ = ఉన్నచోటను, చూడఁగన్, ఒల్లఁడు=ఇష్టపడఁడు. ఎట్లనఁగా, ఈఁగ, అశుద్ధగుణస్థితిన్=నిర్మలముకాని స్వభావముకలదై యుండుటచేత, పూయమున్=చీమును, కూడిన, పుంటిపైని, నిలువన్, కోరినయట్లు, నూడిద=కానుకగా, (విలాసార్థముగా) పెట్టు=ఉంచుకొనిన, నెన్నుదుటి=నుదుటనున్న, చొక్కపు=అందమైన, కస్తురి మీఁదన్=కస్తూరిపైని, నిల్వనేర్చునే=ఉండగలదా? (ఉండలేదు.)

తా. ఈఁగ మంచివాసనగల కస్తూరిబొట్టుమీఁద వ్రాలక, చెడువాసనతో చీముపట్టిన కురుపుమీఁద వ్రాలును. అటులనే అయోగ్యుడు మంచి వానియొద్దకుఁ బోక యయోగ్యుని దగ్గఱకే పోవుచుండును.

ఉ. ఏల సమస్తవిద్యల నొకించుకభాగ్యముఁ గల్గియుండినన్
జాలు ననేకమార్గములు సన్నుతికెక్క, నదెట్లొకో యనన్
రాలకు నేడ విద్యలు తిరంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలి నమస్కరించి ప్రసవంబులు వెట్టరె మీఁద భాస్కరా.

టీ. భాస్కరా! సమస్తవిద్యలన్=అన్నివిద్యలతో, ఏల=ఏమిప్రయోజనము? ఒకించుక=కొంచెము, భాగ్యము=అదృష్టము, కలిగియుండినన్, అనేకమార్గములు, సన్నుతికెక్కన్=పొగడ్తను పొందుటకు, చాలున్=చాలును. అది ఎట్లు, ఒకో యనన్=అదియేలాగునంటే, విద్యలు, రాలకున్, ఏడన్=ఎక్కడ, (లేవు) తిరంబుగన్=నిలుకడగా, దేవరరూపు=దేవతల యాకారము, చేసినన్, (మానవులని తెచ్చుకోవలెను) వ్రాలి=క్రిందనొఱఁగి, నమస్కరించి, ప్రసవంబులన్ = పూవులను, మీఁదన్ = ఆదేవతావిగ్రహముపై, పెట్టరె=ఉంచరా? (ఉంచుదురని భావము)

తా. రాళ్ళు విద్యలు నేర్వకున్నను, వాని యదృష్టమున దేవతారూపుగా చేసినచో, మానవులు వ్రాలి నమస్కారములు చేసి పూలతో పూజింతురు. అటులనే మానవున కదృష్టరేఖ యుండిన ననేకవిధముల పొగడ్తలు గాంచును. కాని విద్యలు నేర్చినందునకాదు.

ఉ. ఒక్కఁడె చాలు నిశ్చలబలోన్నతుఁ డెంతటికార్యమైనఁ దాఁ
జక్కనొనర్పఁ గౌరవు లసంఖ్యులు పట్టినధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసేన ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసి తుదముట్టఁడె యొక్కకిరీటి భాస్కరా.

టీ. భాస్కరా! నిశ్చల=చలింపని, బల=బలముచేత, ఉన్నతుఁడు=గొప్పవాఁడు, ఒక్కఁడె, చాలున్=చాలును. ఎంతటికార్యము + ఐనన్, తాన్, చక్కన్, ఒనర్పన్=చేయుటకు, ఎట్లనిన, ఒక్క కిరీటి=ఒకయర్జునుఁడే,

అసంఖ్యులు=లెక్కలేనిమంది, కౌరవులు=దుర్యోధనాదులు, పట్టిన ధేనుకోటులన్=పట్టుకొనిన యాలమందలను, చిక్కఁగన్ + ఈక = దొరకనీయక, తత్ + పరిబలసేన=ఆకౌరవులయొక్క గొప్పసైన్యమును, అనేకశిలీముఖంలన్=పెక్కు బాణములచేత, మొక్కపడంగఁజేసి=ఓడునట్లుజేసి, తుదముట్టఁడె=పూనిక నెఱవేర్పఁడా? (నెఱవేర్చుకొనును)

తా. దుర్యోధనాదులు గొప్పసైన్యముతో విరటుని యాలమందను తోలుకొని పోవుచుండఁగా నర్జునుఁ డొక్కఁడే అనేక బాణములచే వారలను జయించి, గోవులను వారివశము గానీయక మరలించుకొని వచ్చెను. అటులనే స్థిరమైన బలవంతుఁడు తానెంతటికార్యమైనను నెఱవేర్పఁగలఁడు.

పూర్వగాథ:—పాండవు లజ్ఞాతవాస వత్సరమును చెల్లించుటకై భార్యతోఁ గలసి, మాఱువేషములతో విరటుని సేవించుచుండిరి. దుర్యోధనుఁడు, పాండవులు విరటునివద్ద నుండిరని గ్రహించి విరటుని గోవుల దోలుకొనిపోవ యత్నించినచో బాండవులు బయలు పడుదురనియు, మొదటి నిర్ణయప్రకారము మరల యడవికంపవలెనని నిశ్చయించి గొప్ప సైన్యముతోఁబోయి విరటుని యాలమందలను తన పురికి తోలుకొని వచ్చుచుండఁగా గడువుదినములు ముగియుటచే యర్జును డొక్కఁడే పోయి కౌరవులను జయించి గోగణములను దోలుకొనిపోయి విరటున కొప్పగించెను.

ఉ. కట్టడదప్పి తాముచెడుకార్యముఁ జేయుచునుండిరేని దోఁ
బుట్టినవారినైన విడిపోవుటకార్యము; దౌర్మదాంధ్యముం
దొట్టినరావణాసురునితో నెడఁబాసి విభీషణాఖ్యుఁ డా
పట్టున రాముఁజేరి చిరపట్టము గట్టుకొనండె భాస్కరా.

టీ. భాస్కరా! కట్టడదప్పి=మర్యాదదప్పి, తాము, చెడు కార్యముల్=చెడ్డపనిని, చేయుచున్, ఉండిరేని, తోఁబుట్టినవారినైన, విడి=విడిచి, పోవుట, కార్యము=తగినపని. దౌర్మద + అంధ్యముల్=చెడ్డతనముచే

గలిగిన దుర్మదత్వమును, దొట్టిన=పొందిన, రావణాసురునితో, ఎడబాసి, విభీషణాఖ్యుఁడు విభీషణుఁడను పేరుగలవాఁడు, ఆపట్టునన్=ఆసమయము నందె, రామున్=శ్రీరామచంద్రుని, చేరి, చిరపట్టము=శాశ్వతమైన లంకాధిపత్యము, కట్టుకొనండె=కట్టుకొనలేదా (కట్టుకొనెను)

తా. దుర్మదుఁడైన రావణాసురునితమ్ముఁడగు విభీషణుఁడతనిని విడిచి పెట్టి శ్రీరామచంద్రునిఁజేరి శాశ్వతమైన లంకాధిపత్యముఁబొందెను. అట్లే చెడుపనులుచేసినచో సోదరుఁడైనను వానిని విడిచిపెట్టుట మంచిపని. (తనకు లాభము కలుగును.)

పూర్వగాథ:—రావణుఁడు శ్రీరామునిభార్యయగు సీతాదేవిని చెఱ పట్టగా విభీషణుఁడు తనయన్నయగు రావణునితో సీతాదేవిని శ్రీరామున కిచ్చి శరణువేడుకొనుమని పెక్కుగతుల బోధించెను. రావణుఁ డదివినక విభీషణు నవమానింపఁగా విభీషణుఁడు అన్నను విడిచి శ్రీరాముని శరణు జొచ్చెను. అంత శ్రీరాముడు రావణుని సంహరించి విభీషణుని లంకకు రాజుగా జేసెను. చిరంజీవియై వర్ధిల్లెను.

ఉ. కట్టడ యైనయట్టినిజకర్మము చుట్టుచు వచ్చి యేగతిం
బెట్టునొ పెట్టినట్లనుభవింపక తీఱదు, కాళ్లు, మీఁదుగాఁ
గిట్టక వ్రేలుఁ డంచుఁ దలక్రిందుగఁ గట్టిరెయెవ్వరైననా
చెట్టున గబ్బిలంబులకుఁ జేరినకర్మము గాక భాస్కరా.

టీ. భాస్కరా! కట్టడ=విధివిహితము, ఐనయట్టి నిజకర్మము=అయినట్టిపూర్వకృతకర్మము, చుట్టుచున్=ఆవరించుచు, వచ్చి, ఏగతిన్ పెట్టును + ఒ=ఎట్లుకలుగఁజేయునో, పెట్టినట్లు=కలుగజేసినట్లు, అనుభవింపక తీరదు. ఎట్లనఁగ, ఆచెట్టునన్, గబ్బిలంబులకు, చేరినకర్మము గాక=పొందినపూర్వ కర్మముతప్ప, ఎవ్వరైనను, గిట్టక = సహింపక, కాళ్ళుమీఁదుగాన్=తల క్రిందుగా; వ్రేలుఁడు, అంచున్, కట్టిరె=కట్టినారా! (లేదు)

తా. గబ్బిలములు యితరులెవ్వరును తమ్ముతలక్రిందుగా చెట్టునకు వ్రేలాడఁగట్టకున్నను తమపురాకృతకర్మము చేతనే యట్లు వ్రేలాడుచుండును. అట్లే విధివిహితమైన పురాకృతకర్మము తన్నావరించి యెట్టికష్టముల బెట్టినను మానవుఁ డట్లనుభవింపక తీరదు.

ఉ. కట్టడ లేనికాలమునఁ గాదు శుభంబొరులెంతవారు చే
పట్టిననైన మర్త్యునకు భాగ్యమురాదనుటెల్లఁ గల్ల కా
దెట్టని పల్కినన్ దశరథేశవసిష్ఠులు రామమూర్తికిన్
బట్టముకట్టఁ గోరి రది పాయక చేకుఱెనోటు భాస్కరా.

టీ. భాస్కరా! మర్త్యునకున్=మనుష్యునకు, కట్టడ=దైవనిర్మితమైన యేర్పాటు, లేనికాలమున, శుభంబు, కాదు, ఒరులు=ఇతరులు, ఎంతవారు=ఎంతటిగొప్పవారు, చేపట్టినన్ + ఐనన్=చేరదీసినప్పటికిని, భాగ్యము రాదు, అనుట ఎల్లన్, కల్లకాదు. ఎట్లు + అని పల్కినన్, దశరథేశవసిష్ఠులు=దశరథరాజును, వసిష్ఠునియును, రామమూర్తికిన్ = శ్రీరామచంద్రునకు, పట్టముకట్టన్=పట్టాభిషేకము చేయుటకు, కోరిరి. అది, పాయక=చెడిపోక, చేకుఱెన్ + ఓటు=జరిగినదా? (లేదు)

తా. దశరథమహారాజును, వసిష్ఠమహామునియును, శ్రీరామచంద్రునకు పట్టాభిషేకముజేయ నెంతయత్నపడినను విధివిధానములేక జరుగలేదు అట్లే మనుజునకు దైవనిర్మితమగు నేర్పాటులేనప్పుడు యెంతటి గొప్పవారు సహాయము చేసినను శుభములుకలుగవు.

పూర్వగాథ:— దశరథుఁడు శ్రీరామునకు పట్టముగట్టనుండఁగా కైకేయి తనకు తొల్లియిచ్చినవరములను నేడిమ్మని రాముని అడవికిపంపుమనియు భరతునకు పట్టాభిషేకము చేయుమనియు రెండువరములు దశరథుని కోరెను. శ్రీరాముడు పట్టాభిషేకభంగమొంది తండ్రివరములనుదీర్ప సీతాలక్ష్మణులతో అరణ్యవాసమునకు వెళ్ళెను.

ఉ. కానక చేరఁ బోల దతికర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం
డా నది నమ్మి వానికడ దాయఁగఁబోయిన హానివచ్చు న
చ్చో నదియెట్లనంగొఱఁకుచూపుచునొడ్డినబోనుమేలుగాఁ
బోనని కాన కాసపడి పోవుచుఁగూలదెకొక్కు భాస్కరా.

టీ. భాస్కరా! అతికర్ముఁడు = చెడుపనులుచేయువాఁడు, ఎన్ని నమ్మికలు, చేసినన్, కానక=ఆలోచింపకుండ, చేరన్ + పోలదు=సగ్గఱకు పోఁగూడదు, తాన్, అదినమ్మి, వానికడన్=ఆపాపుఁడున్నచోటికి, దాయగన్=చేరునట్లు, పోయిన, అచ్చోన్=అచ్చట, హాని=కీడు, వచ్చున్=వచ్చును. అది, ఎట్లఁన్, కొక్కు=పందికొక్కు, కొఱకు=మేతను, చూపుచు, మేలు గాన్, ఒడ్డిన=పన్నిన, బోనును, బోను + అని=తన్నుజంపుయంత్రమని, కానక=తెలిసికొనక, ఆసపడి, పోవుచున్=వెళ్ళుచు, కూలదె=చావదా? (చచ్చును)

తా. తనకుఁ దిండినిజూపుచు పన్నినబోనును బోనని తెలిసికొనక పందికొక్కు ఆసించి బోయి యందుచచ్చును. అట్లే యెన్నినమ్మికలు చేసినను తెలిసికొనకుండా పాపాత్మునిదగ్గరకు వెళ్ళరాదు. నమ్మి వెళ్ళినచో హాని సంభవించును.

ఉ. కానిప్రయోజనంబు సమకట్టదు తా భువినెంతవిద్యవాఁ
డైనను దొడ్డరాజుకొడుకైనను నదెట్లు? మహేశుపట్టి వి
ద్యానిధి సర్వవిద్యలకుఁదానెగురుండు వినాయకుండు దాఁ
నేనుఁగురీతి నుండియు నదేమిటి కాడఁడుపెండ్లి? భాస్కరా.

టీ. భాస్కరా! భువిన్, తాన్, ఎంతవిద్యవాఁడు + ఐనన్=ఎంత చదువుగలవాఁడైనను, దొడ్డరాజుకొడుకు, ఐనను, కానిప్రయోజనంబు= అనుకూలపడనిపని, సమకట్టదు=కానేరదు. అదిఎట్లనఁగ, మహేశుపట్టి=

ఈశ్వరునిపుత్రుఁడు, విద్యానిధి=చదువులకు స్థానభూతుఁడును, సర్వవిద్యలకు=అన్నివిద్యలకును, తానె, గురుండు=చెప్పువాఁడు, వినాయకుండు=విఘ్నేశ్వరుఁడు, తాన్, ఏనుఁగురీతిన్=ఏనుఁగువలె, ఉండియున్, పెండ్లి, ఏమిటికిన్=ఎందువలన, ఆడఁడు=చేసికొనఁడు?

తా. వినాయకుం డీశ్వరునికుమారుఁడును సర్వవిద్యలకు స్థానభూతుఁడును, అన్నివిద్యలకు గురువున్న యేనుఁగువంటి బలముకలవాఁడును అయియుండియు బెండ్లాడలేకపోయెను. అట్లే మనుష్యుఁ డెంతవిద్యావంతుడైనను గొప్పరాజకుమారుఁడైనను దైవ మనుకూలింపనికార్యము జేసుకొనలేడు.

ఉ. కామితవస్తుసంపదలు గల్గుఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి యేటికి? నిష్ఫల మున్నఁబోయినన్
బ్రామికపడ్డలోకులకుఁ బండఁగ నే మది యెండిపోవఁగా
నేమిఫలంబు? చేఁదు విడ దెన్నఁటికైన ముసిండిభాస్కరా.

టీ భాస్కరా! ఒరులు=ఇతరులు, కామిత=కోరిన, వస్తుసంపదలు=పదార్థములయొక్క సంపత్తులు, కల్గుఫలంబు=కల్గుటవలన ప్రయోజనము, ఆసపడ్డచోన్, ఏమియున్, పెట్టఁడేని, సిరి=వానిభాగ్యము, ఏటికిన్=ఎందులకు, ఉన్నన్=ఉన్నప్పటికిని, పోయినన్=నశించినప్పటికిన్ని, నిష్ఫలము=వ్యర్థము. ఎట్లనిన, ముసిండి=ముసిణిచెట్టు, ఎన్నటికైనన్, చేఁదు, విడదు. అది=ఆచెట్టు, పండఁగన్ + ఏమి=పండినప్పుడయినను, ఎండిపోవఁగాన్=ఎండిపోయినప్పుడయినను, బ్రామికపడ్డలోకులకున్ = ఆసపడియున్న జనమునకు, ఏమిఫలంబు=లాభమేమి? (లేదు)

తా. ఎప్పుడును చేఁదును వదలని ముసిణిచెట్టు పండినను యెండినను దాని నాశ్రయించియున్న మానవులకేమియును నష్టములేదు. లాభములేదు. అట్లే భాగ్యవంతుఁడు తన్నాశ్రయించి కోరుకొన్న మానవులకెంతమాత్రము

ఫలమునీయకున్నచో వానికి సంపదయున్నను నశించినను లాభములేదు నష్టములేదు. సమానమేయగును.

ఉ. కారణ మైనకర్మములు కాక దిగంబడ వెన్నిగొందులం
దూటిన నెంతవారలకుఁ; దొల్లిపరీక్షితు శాపభీతుఁడై
వారిధి నొప్పునుప్పరిగపైఁ బదిలంబుగ డాఁగియుండినం
గ్రూరభుజంగదంతహతిఁగూలఁడెలోకులెఱుంగ భాస్కరా.

టీ. భాస్కరా! ఎన్నిగొందులన్=ఎన్నిమూలలలో, దూటినన్=దాగియున్నను, ఎంతవారలకున్=ఎట్టిగొప్పవారికిని, కారణము=అనుభవింపహేతువు, ఐనకర్మములు=అయినపనులు, కాక=జరుగక, దిగంబడవు=మానవు. ఎట్లనన్, తొల్లి = పూర్వము, పరీక్షితు = పరీక్షన్మహారాజు, శాపభీతుఁడై=మునిశాపమువలన భయపడినవాఁడై, వారిధిన్=సముద్రమునందు, ఒప్పు=ప్రకాశించు, ఉప్పరిగపైన్=మేడపైని, పదిలంబుగన్=భద్రముగా, డాఁగియుండినన్=దాఁగుకొనియున్నను, క్రూర=భయంకరమైన, భుజంగ=పాముయొక్క, దంత = కోరలయొక్క, హతిన్ = కాటుచేత, లోకులు=ప్రజలు, ఎఱుంగన్, కూలఁడె=చావఁడా? (చచ్చెను)

తా. పరీక్షిన్మహారాజు మునియిచ్చిన శాపమునకు భయపడి సముద్రములోని మేడపై భద్రముగ దాగియుండినను పాముకాటువలన చనిపోయెను. అట్లే ఎంతగొప్పవారలయినను యెన్నిమూలలలో దాగియున్నను అనుభవింపవలసిన కర్మ మనుభవింపక తీరదు.

పూర్వగాథ:—అర్జునుని కుమారుఁడగు యభిమన్యునకు యుత్తరయను భార్యయందు పరీక్షిత్తుఁడు జన్మించెను. పరీక్షిత్తు పాండవుల యనంతరము కురుదేశమును పాలించెను. ఈతఁ డొకనాఁ డడవికి వేటకు వెళ్ళి దప్పిగొని శమీకుఁడను మునిని దాహమడుఁగ, ముని తపస్సులోనుండుటచే మాట్లాడనందున చచ్చినపాము నాతని మెడలో వేసెను. కొంత సేపటికి మునికుమారుఁ

డైన శృంగియనువాఁడు వచ్చి చూచి తండ్రిమెడలో పామును వైచినవాఁడేడుదినములలో పాముకాటువలన చచ్చుఁగాకయని శపించెను. రాజందులకు భయపడి సముద్రములో మేడకట్టించుకొని కడుభద్రముగా నుండెను. కాని యేడవనాఁ డొకబ్రాహ్మణుఁడిచ్చిన నిమ్మపండును వాసనజూచుచుండ నందుండి యొకపామువచ్చి యాతనిఁ గఱచిచంపెను.

ఉ. కులమున నక్కడక్కడ నకుంఠితధార్మికుఁడొక్కఁడొక్కఁడే
కలిగెడుఁగాక పెందఱుచు గల్గఁగనేరరు; చెట్టుచెట్టునన్
గలుగఁగనేర్చునే గొడుగుకామలుచూడఁగ నాడనాడ నిం
పలరఁగ నొక్కటొక్కటినయంబునఁజేకుఱుఁగాక భాస్కరా.

టీ. భాస్కరా! అకుంఠితధార్మికుఁడు=చలనములేని ధర్మబుద్ధిగలవాఁడు, కులమునన్, అక్కడక్కడన్, ఒక్కఁడొక్కఁడె, కలిగెడుఁగాక=ఉండునుగాని, పెందఱుచు=మిక్కిలి ఎక్కువఁగా, కల్గనేరరు=ఉండజాలరు. చూడఁగన్=ఆలోచింపఁగా, గొడుగుకామలు, ఆడనాడన్=అక్కడక్కడ, ఇంపు + అలరన్=అందముమీఱఁగా, నయమునన్=పరిమితముగా, ఒక్కటొక్కటి, చేకుఱున్ + కాక=దొరకునుగాని, చెట్టుచెట్టునన్, కలుగఁగనేర్చున్ + ఎ=కలుగునా? (ఉండవు.)

తా. ఆలోచింపఁగా గొడుగుకామలు అక్కడక్కడ పరిమితముగా నొక్కొక్కటి దొరకునుగాని ప్రతిచెట్టునందును దొరకవు. అట్లే మంచి ధర్మబుద్ధిగలవాఁడు కులమున నక్కడక్కడ నెక్కడోఁ గల్గునుగాని, ఎక్కువగానుండరు.

ఉ. క్రూరమనస్కు లౌపతులఁ గొల్చి వసించినమంచివారికిన్
వారిగుణంబెపట్టి చెడువర్తన వాటిలు; మాధురీ జలో
దారలు గౌతమీముఖమహానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁ జెందవే మొదలికట్టడలన్నియుఁదప్పి భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరమనస్కులు = కఠినమైన మనస్సుగలవారు, క్ష్మాపతులన్=అయినట్టిరాజులను, కొల్చి, వసించినమంచివారికిన్ = ఉన్న మంచిజనులకు, వారిగుణంబె=ఆకఠినులగురాజులగుణమే, పట్టి=కలిగి, చెడు వర్తన, వాటిలున్=ఏర్పడును. ఎట్లనిన, మాధురీ=తియ్యనైన, జల=నీటిచేత, ఉదారలు=గొప్పవగు, గౌతమీ = గోదావరి, ముఖ=మొదలయిన, మహానదులు, అంబుధిన్=సముద్రమును, కూడినంతనే=చేరినంతనే, మొదలికట్టడలు + అన్నియున్ = ముందుండు తియ్యదనము మొదలగు నియమములను, తప్పి=విడిచి, క్షారమున్=ఉప్పదనమును, చెందవే = పొందవా? (పొందును.)

తా. తియ్యనినీటితో నొప్పుచున్న గోదావరి మొదలగు నదులన్నియును సముద్రములో చేరినంతనే మొదటగల తియ్యనిరుచిని దప్పి యుప్పదనమును బొందుచున్నవి. అట్లే క్రూరబుద్ధిగల రాజులను సేవించుచున్న మంచివారికి వారిమంచిగుణము పోయి క్రూరగుణమే సంభవించును.

1 విశేషాంశము:—క్రూరమనస్కుఁ డౌపతిని, అనిపాఠాంతరము.
2 మాధురిజలంబారయ, అనిపాఠాంతరము.

ఉ. గిట్టుట కేడఁ గట్టడ లిఖించిన నచ్చటఁగానియొండుచోఁ
బుట్టదు చావు; జానువులపుస్కల నూడిచి కాశిఁ జావగా
ల్గట్టినశూద్రకున్ భ్రమలఁ గప్పుచుఁదద్విధిగుఱ్ఱయౌచునా
పట్టునఁ గొంచు మఱ్ఱికడ బ్రాణముతీసెగదయ్య భాస్కరా.

టీ. భాస్కరా! గిట్టుటకు=చచ్చుటకు, ఏడన్=ఎక్కడ, కట్టడ=దైవనిర్ణయము, లిఖించినన్=వ్రాసినట్లయిన, అచ్చటన్, కాని = కాక, ఒండుచోన్=మరియొకచోటునందు, చావుపుట్టదు. ఎట్లనన్, కాశిన్=కాశీపురమునందు, చావన్=చచ్చుటకై, జానువుల=మోకాళ్ళయొక్క, పుస్కలన్=చిప్పలను, ఊడిచి=తీసివైచి, కాల్గట్టిన=నిశ్చయముచేసికొన్న, శూద్ర

కున్=కూచ్రికుఁడను మహారాజును, తత్ + విధి=ఆదైవము, భ్రమలగప్ప చుక=మాయచేచుట్టుచు, గుఱ్ఱము + ఔచు, అపట్టునఁ=ఆవేళను, కొం చుక=పైనెక్కించుకొనిపోయి, మఱ్ఱికడన్ = ప్రాణము, తీసెఁ + కద అయ్యా=తీసెనుకదా?

తా. కూచిక్రమహారాజు కాశీపురమున చచ్చుటకై మోకాలిచిప్పల నూఁడదీసికొని యచ్చటనే నిశ్చయముఁ జేసుకొనియుండఁగా దైవ మొక గుఱ్ఱమై మాయపన్ని మరణవేళను వానినెక్కించుకొని మఱ్ఱిచెట్టునొద్దఁ బ్రాణముఁ దీసెను. అట్లే, ఎచ్చటఁ జచ్చుటకు విధి వ్రాసియుండునో యచ్చ టనే చచ్చునుగాని వేఱొకచోటునందుఁ జావఁడు.

చ. ఘనబలసత్త్వ మచ్చుపడఁ గల్గినవానికి హాని లేనిచోఁ
దనదగుసత్త్వమే చెఱుచుఁ దన్ను; నదెట్లన? నీరు లావుగాఁ
గను వసియించినన్ చెఱువుకట్టకు సత్త్వము చాలకున్నచోఁ
గనుమలు పెట్టి నట్టనడిగండి తెగంబడకున్నె? భాస్కరా.

టీ. భాస్కరా! ఘనబలసత్త్వము = గొప్పబలముతోఁగూడినసత్త్వ, అచ్చుపడన్=ఏర్పడునట్లు, కల్గినవానికి, హాని=కీడు, లేనిచోన్, తనది, అగుసత్త్వమే=అయినట్టిబలమే, తన్నుఁ, చెఱుచును. అది + ఎట్లు + అనన్, 1 నీరు, 2 లావుకాఁ + కను = ఎక్కువఁగా, వసియించినఁ= ఉన్నప్పుడు, చెఱువుకట్టకుఁ=చెఱువుగట్టునకు, సత్త్వము=బలము, చాల కున్నచోఁ, కనుమలు=సందులు, పెట్టి=పడి, నట్టనడిగండి=ఆచెఱువుమధ్య కన్నము, తెగంబడక=తెగిపోవక, ఉన్నె=ఉండునా? (ఉండదు.)

తా. చెఱువున నీరెక్కువఁగానున్నపుడు చెఱువుగట్టునకు బలము చాలకున్నచో మధ్యగండి తెగును. అట్లే తనకధికబలమున్నందున నితరులచే హానికల్గకున్నను, తనసత్త్వయే తన్నుఁబాడు చేయును.

1 నీసుమిక్కిలింగనుకవసించినన్, పాఠాంతరము. 2 లావుగా=లావు విశాఖపురిప్రాంతమున నధికార్థము.

చ. ఘనుఁడగునట్టివాడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని బ్రార్థనచేయుట తప్పు గాదుగా;
యనఘతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడుమీఁద బెత్తుగాఁ
గనుఁగొనిగాలిగానికడకాళ్ళకు మ్రొక్కఁడెనాఁడుభాస్కరా.

టీ. భాస్కరా! ఘనుఁడగునట్టివాఁడు = గొప్పవాఁడగు మనుజుఁడు, నిజకార్య=తనయొక్కపనిని, సముద్ధరణార్థము + ఐ=నెఱవేర్చుకొనుటకై, మహిన్=భూమిని, పనివడి=పనిబూని, అల్పమానవునిన్=నీచుఁడగుమనుజుని, పార్థనచేయుట, తప్పుగాదుగా=దోసముకాదుగదా? ఎట్లనిన, కృష్ణజన్మమునన్=శ్రీకృష్ణమూర్తి జన్మించినకాలమందు, అనఘతన్=పాపరహితముగా, ఆవసుదేవుఁడు, మీఁదబెత్తుగాన్=తలమానికముగా, కనుఁగొని= భావించి, నాఁడు=ఆవేళ, గాలిగాని కడకాళ్ళకున్=గాడిదయొక్క వెనుక పాదములకు, మ్రొక్కఁడు + ఎ=నమస్కరింపఁడా! (నమస్కరించెను.)

తా. శ్రీకృష్ణమూర్తి జన్మించిన సమయమునందు నాతనితండ్రియగు వసుదేవుఁడు కృష్ణునిరక్షించుటకై గాడిదవెనుకకాళ్ళను పాపరహితముగాను శిరోభూషణముగాను భావించి నమస్కరించెను. అట్లే గొప్పవాఁడయిన వాడు తనకార్యమును నెఱవేర్చుకొనుటకై పనిబూని నీచునిప్రార్థించినను దోషము కానేరదు.

పూర్వగాథ:—చంద్రవంశపురాజగు వసుదేవుఁడు కంసుని చెల్లెలగు దేవకీదేవిని పెండ్లాడెను. కంసుడు తనచెల్లెలిని యత్తవారింటికి బంపుచుండగా "కంసుఁడా! దేవకీదేవిగర్భమునబుట్టువాఁడు నినుచంపు" నని యాకాశవాణి పల్కెను. కంసుఁ డందులకు వెఱచి దేవకీవసుదేవులను బంధించి చెఱలోనుంచి వారిసంతానమును ఆరుగుర జంపెను. ఏడవవాఁడు బలరాముఁడు,

విష్ణుమాయచే దేవకీగర్భమునుండి యశోదాదేవిగర్భమున జేర్పబడి జన్మించెను. ఎనిమిదవవాడుగ శ్రీకృష్ణుఁ డవతరించెను. వసుదేవుఁ డాపిల్లవానిని గంసుఁడు చంపునని యచ్చటికి సమీపముననున్న వ్రేపల్లెలో యశోదాదేవి దగ్గఱవిడిచిరావలెనని శ్రీకృష్ణుని యెత్తుకొనిపోవుచుండెను. దేవకికి సంతానముకల్గినపుడెల్ల యీసంగతి కంసునకు దెల్పుటకై యొకరాక్షసుఁడు గాడిద వేషముతో నందుఁ గాపుండును. వసుదేవుఁడట్లు శ్రీకృష్ణుని తీసుకొనిపోవుచుండఁగా గాడిద భగవన్మాయచే నరువలేక యూరకుండఁగా వసుదేవుడు గాడిదనుజూచి యది యార్చునేమోయని భయమునొంది దానికాళ్ళు పట్టుకొని శాంతింపజేసి తనకార్యమును సాధించెను.

ఈకథ వాడుకలోనున్నదికాని భాగవతమునందులేదు. "వలనుదప్పినపుడు వసుదేవుడు గాడిదకాళ్ళుపట్టుకొనె"నని లోకోక్తిగలదు.

చ. ఘనుఁడొకవేళఁ గీడ్పడినఁ గ్రమ్మఱ నాతనిలేమివాపఁగాఁ
గనుఁగొన నొక్కసత్ప్రభువుగాక నరాధములోపరెందఱుం
బెనుఁ జెఱు వెండినట్టితఱిఁ బెల్లున మేఘుఁడు గాక నీటితోఁ
దనుపఁదుషారముల్ శతశతంబులుచాలునటయ్యభాస్కరా.

టీ. భాస్కరా! ఒకవేళన్, ఘనుఁడు=గొప్పవాఁడు, కీడ్పడినన్=కీడుచేదరిద్రుఁడయినచో, క్రమ్మఱ=మరల, ఆతనిలేమి=ఆతనిబీదతనమును, వాపఁగాన్=పోగొట్టుటకు, కనుఁగొనన్=విచారింపఁగా, ఒక్కసత్ప్రభువుగాక=ఒకమంచిరాజేగాని, నరాధములు=నీచమానవులు, ఎందఱున్=ఎంతమందియైనను, ఓపరు=తాళలేరు. పెనుచెఱువు=పెద్దచెఱువు, ఎండినట్టి తఱిన్=పట్టిపోయినప్పుడు, పెల్లునన్=త్వరగా, నీటితోన్, తనుపన్=నిండించుటకు, మేఘుఁడుగాక, తుషారముల్=మంచుబిందువులు, శతశతంబులు=నూఱునూఱులైనను, చాలునటయ్యా=చాలునా? (చాలవు.)

తా. పెద్దచెఱువు యెండిపోయినప్పుడు దానిని త్వరలో నీటిచే నిండించుటకు మేఘమే వర్షింప సరిపోవునుగాని, మంచుబిందువు లెన్ని వర్షించినను జాలవు. అట్లే యొకగొప్పవాఁడు కీడుచే బీదవాఁడైనచో నాతని బీదతనముఁ బోగొట్టుటకు మందిరాజే సరిపోవునుగాని నీచమానవు లెందరైనను సరిపోరు.

ఉ. చంద్రికళావతంసుకృపచాలనినాఁడు మహాత్ముఁడైనఁదా
సాంద్రవిభూతిఁ బాసియొకజాతివిహీనునిఁగొల్చియుంటయో
గీంద్రనుతాంఘ్రిపద్మమతిహీనత నొందుటకాదుగా హరి
శ్చంద్రుఁడువీరబాహునినిజంబుగఁగొల్వఁడెనాఁడుభాస్కరా.

టీ. భాస్కరా! యోగీంద్ర = మునీశ్వరులచే, నుత=పొగడబడిన, అంఘ్రిపద్మ =, పాదపద్మములుగల భాస్కరా! మహాత్ముఁడు + ఐనన్= గొప్పవాఁడైనను, చంద్రికళావతంసు=చంద్రరేఖయే శిరోభూషణముగాగ యీశ్వరునియొక్క, కృప=దయ, చాలనినాఁడు, తాను, సాంద్రవిభూతిన్=గొప్పఐశ్వర్యమును, పాసి=విడిచి, ఒకజాతివిహీనునిన్=ఒకనీచకుల మువానిని, కొల్చియుండుట=సేవించియుండుట, మతిహీనత=తెలివితక్కువ, కాదుగా=కాదుగదా! ఎట్లన, నాఁడు=ఆదినములలో, హరిశ్చంద్రుఁడు, వీరబాహునిన్=వీరబాహుఁడను మాతంగుని, నిజంబుగన్, కొల్వఁడు + ఎ=సేవింపలేదా? (సేవించెను.)

తా. పూర్వము హరిశ్చంద్రుఁడు రాజాధిరాజైనను దైవకృప లేక పోవుటచే మాదిగకులజుఁడగు వీరబాహుని సేవించెను. అట్లే ఈశ్వరుని దయలేనప్పుడు తానెంతటి ఘనుఁడయినను గొప్పసంపదలను విడిచి యొక నీచుని సేవింపవలసివచ్చును. అట్లు సేవించుట దైవకృప లేకయేగాని తెలివితక్కువగాదు.

పూర్వగాథ:—సూర్యవంశమునందు త్రిశంకుఁడను రాజునకు సత్యవ్రతమునఁ బ్రసిద్ధికెక్కిన హరిశ్చంద్రుఁడు జన్మించి అయోధ్యను రాజధానిగా జేసుకొని పాలింపుచుండెను. భార్య చంద్రమతి. కుమారుఁడు లోహితాస్యుడు. ఒకనాఁడు దేవేంద్రుఁడు సభదీరియున్న మునులనుజూచి "ప్రపంచమున సత్యసంధుఁ డెవ్వ"డని యడుగగా వసిష్ఠుడు "హరిశ్చంద్రుఁ"డని చెప్పెను. అంత విశ్వామిత్రుఁడు "హరిశ్చంద్రుని బొంకించెద"నని పందెము వేసి హరిశ్చంద్రునివద్దకువచ్చి యజ్ఞమునకు ధనమడిగి ఆధనము తరువాత గైకొందునని హరిశ్చంద్రునిదగ్గర నేయుంచి అనేకయిడుములుకల్గించి దానరూపమున రాజ్యముగ్రహించి పిదప వెనుకటియజ్ఞధన మీయుమని నిర్బంధము చేసెను. ముని ఋణము దీర్చుటకై నక్షత్రకుని వెంటబెట్టుకొని సతీసుతసమేతముగా హరిశ్చంద్రుఁడు కాశీపురినిజేరి సతీసుతులను బ్రాహ్మణునకు విక్రయించి తాను వీరబాహుఁడను మాలవానికమ్ముడుబోయి బాకీతీర్చి యనేక కష్టములుపడి పిదప కొలదికాలములోనే తనరాజ్యమును బొంది జగజ్జేగీయమానమైన కీర్తిగాంచెను.

ఉ. చక్కఁదలంపఁగా విధివశంబున నల్పునిచేతనైనఁ దాఁ
జిక్కియవస్థలం బొరలుఁజెప్పఁగరానిమహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్త్వసంపదల మీఱినగంధగజంబు మావటీఁ
డెక్కియదల్చి కొట్టికుదియించిన నుండదెయోర్చిభాస్కరా.

టీ. భాస్కరా! చక్కన్=బాగుగా, తలంపఁగా=ఆలోచింపఁగా, చెప్పన్+కన్=చెప్పుటకు, రానిమహాబలాఢ్యుఁడున్=వీలుపడనిగొప్పబలవంతుఁడయినను, తాన్, విధివశంబునన్=దైవవశముచేత, అల్పునిచేతన్+ఐనన్=నీచునిచేనైనప్పటికిని, చిక్కి, అవస్థలన్=కష్టములను, పొరలున్=పొందుచుండును. ఎట్లనఁగ, మావటీఁడు=ఏనుఁగును దోలువాఁడు, ఎక్కి, అదల్చి=బెదరించి, కొట్టి, కుదియించినన్=కృంగునట్లు చేసినను, మిక్కిలి,

సత్త్వసంపదచేన్=అధికబలముచేత, మీాటిన=అతిశయించిన, గంధగజంబు=మదించినయేనుఁగు, ఓర్చి, ఉండదె=ఉండలేదా? (ఉండును.)

తా. మిక్కిలిసత్త్వగల మదపుటేనుఁగు తనపైకి మావటీఁడెక్కి యదలించి యంకుశముతోఁ గొట్టి కృంగజేసిన సహించియుండును. అట్లే యెంత బలవంతుఁడైనను దైవవశముచేత నీచునిచేఁ జిక్కి కష్టములను పొందుచుండును.

చ. చదువది యెంతగల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరుమెచ్చ రెచ్చటం
బదునుగ మంచికూర నలపాకము చేసిన నైన నందు నిం
పొదవెడునుప్పు లేక రుచిపుట్టఁగనేర్చునటయ్య? భాస్కరా.

టీ. భాస్కరా! చదువు, అది, ఎంతగల్గినన్, రసజ్ఞత=సారము తెలుఁగుట, ఇంచుక=కొంచెము, చాలకున్నన్, ఆచదువు, నిరర్థకంబు=పనికిమాలినదగును.ఎచ్చటన్=ఏచోటనైనను, గుణసంయుతులు=మంచిగుణములుగలవారు, ఎవ్వరు, మెచ్చరు. ఎట్లన, మంచికూరను, పదనుగన్=తగినట్లుగా, నలపాకమున్=నలచక్రవర్తి చేయుపాకమువంటిపాకమును, చేసినన్, ఐనన్, అందున్=ఆకూరలో; ఇంపు + ఒదవెడున్ = చక్కనిరుచినిపుట్టించు, ఉప్పు, లేక, రుచి, పుట్టఁగన్ + నేర్చును + అటయ్య=కలుగునా? (కలుగదు)

తా. నలచక్రవర్తి చేయుపాకమువలె పాకముగలమంచికూరను తగినట్లుగావండినను అందులో రుచినిగల్గించునట్టి యుప్పువేయకున్నచో రుచి కలుగదు. అట్లే మానవుఁడెంత విద్వాంసుఁడైనను కొంచెమైనను రసము గ్రహింపలేకున్నచో వానివిద్య పనికిమాలినదగును. ఎక్కడను గుణవంతులెవ్వరును మెచ్చుకొనరు.

సూచన:—అఖండయతి. ఇట్టి యతి ప్రమాణగ్రంథములలో లేదు. బ్రహ్మశ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు రీక్రింది విధముగా దీనిని సవరించిరి.

"ఇం పొదవెడు నుప్పు లేక రుచియుండఁగ నేర్చునటయ్య"

ఉ. చాలఁ బవిత్రవంశమున సంజనితుం డగునేని యెట్టిదు
శ్శీలుని నైనఁ దత్కులవిశేషముచే నొకపుణ్యుఁ డెంతయుం
దాలిమి నుద్ధరించును; సుధానిధిఁ బుట్టఁగఁగాదె శంభుఁ డా
హాలహాలానలంబు గళమందు ధరించుట పూని భాస్కరా.

టీ. భాస్కరా! చాలఁబవిత్రవంశమునన్=మిక్కిలి పావనమైనకులమునందు, సంజనితుండు=పుట్టినవాఁడు, అగునేని, తత్కులవిశేషముచేన్=ఆకులమునందలి గౌరవముచేత, ఎట్టిదుశ్శీలునినైనన్ = ఎట్టిదుష్టగుణములుగలవానినైనను, ఒకపుణ్యుఁడు=ఒకపుణ్యాత్ముఁడు, ఎంతయున్, తాలిమిన్=ఓర్పుచే, ఉద్ధరించును=కాపాడును. ఎట్లనఁ, శంభుఁడు=శివుఁడు, పూని=యత్నించి, ఆహాలహాలానలంబు=ఆహాలాహలమను అగ్నిహోత్రమును, గళమందున్=కంఠమునందు, ధరించుట=తాల్చుట, సుధానిధిన్=పాలసముద్రమందు, పుట్టఁగన్ + కాదె=పుట్టుటచేతనే కదా?

తా. మిగుల భయంకరమైనదైనను హాలాహలమను నగ్నిహోత్రమును పాలసముద్రములో బుట్టినదనెడు కారణముచేత శంభుఁడు దానిని కంఠమునందు దాల్చెను. అట్లే ఎటువంటి చెడుగుణములుగలవాఁడయినను మంచి కులమునఁ బుట్టినచో నాకులమందలి గౌరవముచేత పుణ్యాత్ముఁ డెవరైన నొకఁడు ఆదుష్టుని కాపాడును.

పూర్వగాథ:— దేవతలు, రాక్షసులు, అమృతముకొఱకుఁ బాలసముద్రమును దరువఁగా ముందిహాలాహలమను విషముపుట్టి మిగుల భయంకరముగా లోకములను గాల్చుచుండ, దేవతలు భయపడి యీశ్వరుని ప్రార్థింప నీశ్వరుఁడు దానిని ద్రాగుటకు జడియ గౌరీదేవి ఈశ్వరుని జూచి "నాథా! నామంగళసూత్ర మహత్త్వమున మీకేమియు కీడు వాటిల్లదు విషమును భక్షింపు"డనెను. అంత నీశ్వరుఁడు దానిని మ్రింగి కంఠమున నిల్పి లోకములను రక్షించెను.

ఉ. చేరి బలాధికుం డెఱిఁగి చెప్పినకార్యము చేయకుండినన్
బారము ముట్టలేఁ డొక నెపంబునఁ దాఁ జెడు నెట్టిధన్యుఁడున్
బోరక పాండుపుత్త్రులకు భూస్థలి భాగము పెట్టు మన్నఁ గం
సారిని గాకుచేసి చెడఁడాయెనె కౌరవభర్త భాస్కరా.

టీ. భాస్కరా! బలాధికుఁడు=బలముచేగొప్పవాఁడు, చేరి=దగ్గఱకు వచ్చి, ఎఱిఁగి=సంగతి దెలిసికొని, చెప్పినకార్యము=చెప్పినపని, చేయకుండినన్, ఎట్టిధన్యుఁడున్ = ఎంతగొప్పవాఁడైనను, పారము = తుదను, ముట్టలేఁడు=పొందలేఁడు. ఒక నెపంబునన్=ఒక కారణముచే, తాన్, చెడున్=చెడిపోవును. ఎట్లనిన, పోరక=యుద్ధము చేయకుండ, పాండుపుత్త్రులకు=పాండురాజకుమారులకు, భూస్థలిన్=భూమిని, భాగము పెట్టుము=పంచి యిమ్ము, అన్నన్ కంసారినిన్=అనిన శ్రీకృష్ణుని, కాకుచేసి=తిరస్కరించి, కౌరవభర్త = దుర్యోధనమహారాజు, చెడఁడాయెనె = చెడలేదా? (చెడిపోయెను.)

తా. శ్రీకృష్ణభగవానుఁడు దుర్యోధనునియొద్దకువెళ్ళి పాండవులతో యుద్ధముచేయకుండ రాజ్యమును పంచియిమ్మని చెప్పఁగా నాతనినిఁ దిరస్కరించి దుర్యోధనుఁడు చెడిపోయెను. అట్లే బలశాలి తనకడ కేతెంచి చెప్పిన పనుల చేయకున్నచో నెంతటివాఁడైనను తనపనిని పూర్తిజేసుకొనలేక యేదేని కారణముచేత తానే నశించును.

ఉ. చేసినదుష్టచేష్ట యది చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా
మూసినయంతటన్ బయలు ముట్టకయుండద దెట్లు రాగిపైఁ
బూసిన బంగరుం జెదరి పోవఁగ డంగిన నాఁడు నాటికిన్
దాసినరాగి గానఁబడదా జను లెల్ల నెఱుంగ భాస్కరా.

టీ. భాస్కరా! (మానవుఁడు అనుసది తెచ్చుకొనవలెను) చేసిన దుష్ట చేష్టన్ = తాఁజేసినచెడ్డపనిని, చెప్పక, నేర్పునన్ = ఉపాయముచేత, కప్పి పుచ్చి = కనఁబడకుండఁజేసి, తాన్, మూసినయంతటన్ = దాచినప్పటికిన్ని, బయలుముట్టక = వెల్లడికాకుండ, ఉండదు. అది + ఎట్లు, రాగిపైన్, పూసిన బంగరున్ = పొదిగినబంగారము, చెదరిపోవన్ = చెదరిపోవుటను, కడంగినన్ = ప్రారంభించినయెడల, నాఁడునాఁటికిన్ = ఆనాఁటికానాఁడు, దాసినరాగి = కప్పపడినరాగి, జనులు, ఎల్లన్, ఎఱుఁగన్, కానఁబడదా = కనఁబడకుండునా! (కనబడును.)

తా. రాగిపై పొదిగిన బంగారుపూత చెదరిపోయిన క్రమముగా నందున్న రాగి యందఱకు గనబడును. అట్లే, నీచుఁడొక నీచకార్యమును చేసి చెప్పకుండ నుపాయముచే దాచిపెట్టినను నది క్రమముగా నందరకుఁ దెలియకమానదు.

చ. తగిలిమదంబుచే నెదిరిఁ దన్ను నెఱుఁగక దొడ్డవానితోఁ
బగఁగొనిపోరుటెల్లనతి పామరుఁడై చెడుటింతెకాక తా
నెగడిజయింపనేరఁడది నిక్కముతప్పదు; ధాత్రిలోపలన్
దెగియొకకొండతోఁదగరు ఢీకొని తాఁకిననేమి? భాస్కరా.

టీ. భాస్కరా! తగిలి = వెంబడించి, మదంబుచేన్ = కావరము చేత, ఎదిరిన్ = ఎదుటివానిని, తన్నును, ఎఱుఁగక = తెలిసికొనలేక, దొడ్డవానితోన్ = గొప్పవానితో, పగఁగొని = విరోధముపూని, పోరుట + ఎల్లన్ = పోట్లాడుటంతయు, అతిపామరుఁడు — ఐ = చాలామూఢుఁడై, చెడుట, ఇంతె కాక = ఇంతకన్న వేఱుగా, తాన్, నెగడి = వృద్ధిపొంది, జయింపనేరఁడు = గెలువఁజాలఁడు, అదినిక్కము = అదే నిజము. తప్పదు = తప్పిపోదు. ఎట్లనిన, ధాత్రిలోపలన్ = భూమియందు, తగరు = పొట్టేలు, తెగి = సాహసించి, ఒకకొండతోన్ = ఒకపర్వతముతోడ, ఢీకొని = ఎదుర్కొని, తాఁకినన్ = కలియబడినను, ఏమి = ఏమిలాభమున్నది? (లాభములేదు.)

తా. గొఱ్ఱెపోఁతు సాహసించి యొకపర్వతమును యెదుర్కొని తాఁకినచోఁ దనతల పగులుట తప్ప లాభమేమియు నుండదు. అట్లే, బలహీనుఁడు కావరము చేతఁ దనయొక్కయు ఎదుటివారియొక్కయు బలముఁ దెలియకుండ గొప్పవారితో విరోధముపూని పోట్లాడినచోఁ దానే చెడిపోవును. కాని లాభమేమియును పొందఁడు.

చ. తడవఁగరాదుష్టగుణుఁ దత్త్వమెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణ మిట్లు వల్వదని చెప్పిన గ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁ దెగఁజూచుఁగా మఱుఁగఁగాఁగిన తైలము నీటిబొట్టుపై
బడునెడ నాక్షణంబెగసి భగ్గునమండకయున్నె భాస్కరా.

టీ. భాస్కరా! దుష్టగుణున్ = చెడ్డగుణములుగలవానిని, తత్త్వము = నిజము, ఎఱుంగక, తడవఁగరాదు = వానిజోలికిఁబోఁగూడదు. ఎవ్వరు + ఐనన్, ఆ చెడుగుణము, ఇట్లు, వల్వదు = వద్దు, అని, చెప్పినన్, గ్రక్కున్ = త్వరగా, కోపచిత్తుఁడై = కోపముతోఁగూడిన మనస్సుగలవాఁడై, కడున్ = మిక్కిలి, తెగన్ = సాహసించుటకు, చూచుఁగా = ఆలోచించును గదా! ఎట్లనిన, మఱుఁగన్ = ఉడుకునట్లుగా, కాఁగిన తైలము = కాఁగిననూనె, నీటిబొట్టు, పైన్ = తనయందు, పడునెడన్ = పడునట్టి వేళ, ఆక్షణంబు = అప్పుడే, ఎగసి = మీఁదికిలేచి, భగ్గునన్, మండకయున్నె = మండకపోవునా? (మండును.)

తా. బాగుగఁ గాఁగిననూనె తనపైని నీటిచుక్కపడినయెడల వెంటనే మీఁదికిలేచి భగ్గునమండును. అట్లే చెడ్డవాఁడు తనకు హితము చెప్పినవారిమీఁద కోపమువహించి చెఱుపుచేయుట కెంచును. కావున చెడ్డవాని నిజమును తెలియకుండ వానిజోలికిఁ బోఁగూడదు.

చ. తనకు ఫలంబుచేదని యెదం దలపోయఁడు కీర్తిగోరు నా
ఘనగుణశాలి లోకహిత కార్యము మిక్కిలిభారమైన మే

లనుకొనిపూను, శేషుఁడు సహస్రముఖంబులఁగాలిఁ గ్రోలి తా
ననిశము మోవఁడే మఱి మహాభరమైన ధరిత్రి భాస్కరా.

టీ. భాస్కరా! కీర్తికిన్=యశమునకు, కోరు=అపేక్షించు, అఘన గుణశాలి=అగొప్పగుణములచే నొప్పువాఁడు, తనకున్, ఫలంబు=లాభము, లేదు, అని, ఎదన్=మనస్సులో, తలపోయఁడు=ఆలోచింపఁడు. లోకహిత కార్యము=లోకమునకు మేలగుపని, మిక్కిలి, భారము + ఐనన్=కష్టమైనను, మేలు=మంచిది, అనుకొని, పూనున్=యత్నించును. ఎట్లనిన, శేషుఁడు=ఆదిశేషుఁడు, సహస్రముఖంబులన్ = వేయినోళ్ళతోడను, గాలిన్, క్రోలి=పీల్చి, తాన్, మఱి, మహాభరము=మిగులబరువుగలది, ఐనధరిత్రిన్=అయినభూమిని, అనిశమున్=ఎల్లకాలమును, మోవఁడే=మోయుటలేదా? (మోయుచున్నాఁడు.)

తా. ఆదిశేషుఁడు తనవేయినోళ్ళతో గాలినే పీల్చుకొనుచు తన కేమియు లాభములేకున్నను మిక్కిలి బరువుగల భూమిని యెల్లకాలమును మోయుచున్నాఁడు. అట్లే కీర్తిఁ గోరెడువాఁడు తనకులాభము కలుగ లేదని మదినిఁదలపోయక, లోకమునకు మేలగుపని యెంతకష్టమైనదైనను మంచిదే యనుకొని పూనిచేయును.

పూర్వగాథ:—కశ్యపునకును కద్రువకును అనేక నాగులు జన్మించెను. వానిలో పెద్దవాఁడే యాదిశేషుఁడు. ఈతఁడు తనతల్లియైన కద్రువ సవతితల్లియగు వినతకు చేసిన యన్యాయమునకు సహింపఁజాలక గంధమాదనము, గోకర్ణము మొదలగు దివ్యక్షేత్రములందు బ్రహ్మనుగూర్చి తపస్సు జేసి భూభారమును వహించునట్టి శక్తిని బడసి గరుత్మంతునితో స్నేహము గల్గి శ్రీవిష్ణుమూర్తినిగూర్చి తపస్సుఁజేసి యాయనకు పానుపుగానుండునట్లు వరము సంపాదించి, యాయన యాజ్ఞచేత వేయిపడగలతో భూమిని మోయుచు నాగుల కందఱకు రాజై యుండెను భృగుమహర్షి శాపంబున లక్ష్మణ, బలరామావతారములు పొందెను.

చ. తనకు నదృష్ట రేఖ విశదంబుగఁ గల్గినఁ గాని లేనిచో
జనునకు నెయ్యెడన్ బరుల సంపదవల్ల ఫలంబులేదుగా
కనుఁగవ లెస్సగాఁ దెలివి గల్గిన వారికిఁ గాక గ్రుడ్డికిన్
కనుపడునెట్లు వెన్నెలలుగాయఁగనందొకరూపు భాస్కరా.

టీ. భాస్కరా! తనకున్, అదృష్టరేఖ=భాగ్యరేఖ, విశదంబుగన్=స్పష్టముగా, కల్గినఁగాని, లేనిచో, జనునకున్=మానవునకు, ఎయ్యెడన్=ఏసమయమందును, పరులసంపదవల్ల=ఇతరులభాగ్యమువలన, ఫలంబు=లాభము, లేదుగా=లేదుకదా, ఎట్లనఁగా; కనుఁగవన్=రెండుకన్నులయందును, తెలివి=తేట, లెస్సగాన్=బాగుగా, కల్గినవారికిఁగాక=ఉన్నమానవులకే తప్ప, గ్రుడ్డికిన్=చూపులేనివానికి, వెన్నెలలు, కాయఁగన్=ప్రకాశింపగా, అందున్=ఆవెన్నెలలందు, ఒకరూపు=ఒకరూపమైనను, ఎట్లుకనుపడున్=ఏరీతిగాఁగనఁబడును? (కనపడదు)

తా. వెన్నెలలు ప్రకాశించుచున్నపుడు రెండుకన్నులయందు చూపు గల్గువానికేలాభముగాని గ్రుడ్డివానికి ఆవెన్నెలలందలి ఒకరూపమైనను కన బడనందునలాభములేదు. అట్లే ఇతరులభాగ్యమువల్ల తనకుభాగ్యరేఖకల్గినచో లాభముగల్గునుగాని భాగ్యరేఖలేనిచో పరులసంపద తనకబ్బదు గావున లాభములేదు.

ఉ. తాలిమితోడుతం దగవు తప్పక నేర్పరి, యొప్పుదప్పులం
బాలనసేయుఁగాకట నుపాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలునునీరు నేఱుపఱుపంగ మరాళమెఱుంగుఁగాకమా
ర్జాల మెఱుంగునే తదురుచాతురసజ్ఞతఁబూన భాస్కరా.

టీ. భాస్కరా! నేర్పరి = నేర్పుగలవాఁడు, తాలిమితోడుతన్=ఓర్పుతో, తగవు=న్యాయమును, తప్పక, ఒప్పుతప్పులన్=మంచిచెడ్డలను,

పాలనసేయఁగాక=కనిపెట్టి మాటనుగాని, అటస్=అపనిని, ఉపాయవిహీనుఁడు=నేర్పులేనివాఁడు, చేయన్=చక్కఁజేయుటకు, నేర్చును + ఎ=సమర్థుఁడగునా? మరాళము=హంస, పాలును, నీరును, ఏర్పఱుపంగన్=విడఁదీయుటకు, ఎఱుంగుఁగాక=తెలిసికొనునుగాని, మార్జాలము=పిల్లి, తత్=ఆహంసయొక్క, ఉరు=గొప్పదియు, చారు=మనోజ్ఞమైనదియునగు, రసజ్ఞతన్=రసముగ్రహించుశక్తిని, పూనన్=పొందుటకు, ఎఱుంగునె=తెలిసికొనునా? (తెలిసికొనలేదు.)

తా. పాలును నీరును విడఁదీయుట హంసయెఱుఁగును గాని, పిల్లి గొప్పదగు యారసమును గ్రహించుశక్తిని యెఱుఁగదు. అట్లే ఓర్పుతో తగవుయొక్క మంచి చెడ్డలను నేర్పుగలవాఁడు కనిపెట్టి నిర్ణయించునుగాని తెలివిమాలినవాఁడు కనిపెట్టి నిర్ణయించలేడు.

ఉ. తాలిమితోడఁగూరిమిఁగృతఘ్నునకెయ్యెడను త్తమోత్తముల్
మేలొనరించినన్ గుణము మిక్కిలి కీడగుఁ బాముపిల్లకున్
బాలిడి పెంచిన న్విషము పాయఁగనేర్చునె దానికోరలం,
జాలఁగ నంతకంత కొకచాయను హెచ్చునుగాక భాస్కరా.

టీ. భాస్కరా! ఉత్తమ + ఉత్తముల్=మిక్కిలిమంచివారు, తాలిమితోడన్=ఓర్పుతో, కూరిమిన్=ప్రేమచేత, కృతఘ్నునకున్=చేసినమేలుమఱచినవానికి, ఎయ్యెడన్=ఏవేళను, మేలు=ఉపకారము, ఒనరించినన్=చేసినచో, గుణము=మేలువలనగల్గినఫలము, మిక్కిలి, కీడు, అగున్, పాముపిల్లకున్, పాలు + ఇడి=పాలుపోసి, పెంచినన్, దానికోరలన్=ఆపాముపిల్లకోరలయందు, విషము, చాలఁగన్=ఎక్కువఁగా, అంతకంతకున్=క్రమక్రమముగా, ఒకచాయను=ఒకవిధముగా, హెచ్చునుగాక=ఎక్కువగునుగాని, పాయఁగ నేర్చును + ఎ=ఆవిషముపిడిపోవునా? (విడుపడు)

తా. పాముపిల్లకుఁ బాలుపోసి పెంచినను దానికోఱలయందు విషము క్రమక్రమముగా నెక్కువగును గాని తఱిఁగిపోదు. అట్లే మంచివారు శాంతముతో ప్రేమచేతను కృతఘ్నునకు మేలుచేసినచో వీరిమేలునకు ప్రతిఫలము కీడుగల్గును.

చ. తెలియనికార్య మెల్లఁ గడతేర్చుట కొక్కవివేకిఁ జేకొనన్
వలయు నటైన దిద్దుకొనవచ్చుఁ బ్రయోజనమాంద్య మేమియుం
గలుగదు, ఫాలమందుఁ దిలకంబిడునప్పుడు చేత నద్దముం
గలిగినఁ జక్కఁజేసికొనుఁ గాదె నరుం డదిచూచి భాస్కరా.

టీ. భాస్కరా! తెలియని, కార్యము + ఎల్లన్ = పనియంతయును, కడతేర్చుటకు = నెఱవేర్చుటకు, ఒక్క వివేకిన్ = ఒక జ్ఞానవంతుని, చేకొనన్ వలయున్ = దగ్గఱకుఁదీసికొనవలెను అటు + ఐనన్ = అట్లయినచో, దిద్దుకొనవచ్చున్ = తప్పులులేనట్లు సవరించుకొనవచ్చును. ప్రయోజనమాంద్యము = పనికి యాలస్యము, ఏమియున్, కలుగదు. ఎట్లనన్, నరుండు = మానవుఁడు, ఫాలమందున్ = నుదుటను, తిలకంబు = బొట్టును, ఇడునప్పుడు = పెట్టుకొనునప్పుడు, చేతన్ = చేతియందు, అద్దమున్, కలిగినన్, అదిచూచి = ఆయద్దమునుజూచి, చక్కన్ + చేసికొనున్ + కాదె = బాగుగాదిద్దుకొనునుగదా.

తా. మానవుఁడు నుదుటియందు బొట్టును పెట్టుకొనునప్పుడు చేతియం దద్దమున్నచో నాయద్దమును జూచి బాగుగా బొట్టుదిద్దుకొనును. అట్లే తనకు తెలియనిపనిని నెఱవేర్చుకొనుట కొక నేర్పరిని జేరదీసికొనినచో నాపనిని తప్పులులేకుండా యాలస్యముకాకుండా నిర్వహించుకొనవచ్చును.

ఉ. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే
లక్షలువచ్చుచుండినఁ బలాయనమై చనుఁ గల్లకాదు, ప్ర

త్యక్షము వాఁగులున్ వఱదలన్నియువచ్చిన నీరునిల్చునే
యక్షయమైనగండి తెగినట్టి తటాకములోన భాస్కరా.

టీ. భాస్కరా! ఉ క్షుఁడు = కుటుంబబాహ్యతసహింమనట్టి యజమాని, లేనియింటికిన్, పదార్థము=ద్రవ్యము, వేఱు + ఒక చోటనుండి=మరియొక స్థలమునుండి, వేలక్షలు=వేయిలక్షలు, వచ్చుచుండినన్=వచ్చుచుండినప్పటికిని, పలాయనము + అయి=వెళ్లాచెదరై, చనున్=పోవును, కల్లకాదు= అబద్ధము గాదు. ప్రత్యక్షము=స్పష్టము. ఎట్లనన్, వాఁగులు=కొండకాలువలు, వఱదలు=జలప్రవాహములు, అన్నియున్, వచ్చినన్, అక్షయము=నాశనము లేనిది, ఐనగండి=ఐనకన్నము, తెగినట్టి, తటాకములోనన్=చెఱువులో, నీరు, నిల్చునే=ఉండునా? (ఉండదు.)

తా. స్థిరమైన గండిపడిన చెఱువులోని కిన్నికొండకాలువలు, జలప్రవాహములు వచ్చినను నీరు నిలుపక పోవును. అట్లే కుటుంబబాహ్యసహించునట్టి యజమానిలేని యింటిలోనికి వేఱొకచోటినుండి ద్రవ్యము లక్షల కొలఁది వచ్చుచుండినను యెప్పటికప్పుడే పోవుచుండును.

ఉ. దానపరోపకార గుణధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేకశూన్యునకు లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ, నొక్కసరిపోలును, జీవన కర్థరాత్రి యం
దైన నదేమి పట్టపగలైనన దేమియులేదు భాస్కరా.

టీ భాస్కరా! దాన=ఒకరికిచ్చుట, పరోపకార=ఇతరుల కుపకారము చేయుట, గుణ=గుణములచేత, ధన్యత=కృతార్థత్వము, ఎప్పుడున్, చిత్తములోనన్=మనస్సులో, లేనివివేకశూన్యునకు=లేనిమూఢునకు, లేములు= దరిద్రములు, వచ్చినవేళన్=సంభవించినప్పుడును, సంపదల్=భాగ్యములు, పూనినవేళన్=కలిగినప్పుడును, ఒక్కసరిపోలును=ఒకవిధముగనే యుండును.

ఎట్లనిన, చీఁకనకన్=గ్రుడ్డివానికి, అర్థరాత్రి=నడురేయి, ఐనన్ + అది + ఏమి=అయినప్పుడు లాభమేమి, పట్టపగలు=మధ్యాహ్నము, ఐనన్ + అది + ఏమి=అయినప్పుడు లాభమేమి? (లాభములేదు.)

తా. గ్రుడ్డివానికి నడిరేయి యయినను మిట్టమధ్యాహ్నమైనను యొక టేగాని భేదముండదు. అట్లే దానపరోపకారగుణము లెప్పుడును మనస్సులో లేని మూఢునకు పేదఱికమువచ్చినను భాగ్యముకల్గినను యొక టేగాని భేదముండదు.

ఉ. దానము సేయఁగోరిన వదాన్యునకీయఁగశక్తిలేని-చో
నైనఁ బరోపకారమునకై యొకదిక్కునఁ దెచ్చియైన నీఁ
బూనును మేఘుఁడంబుధికిఁబోయి జలంబులఁదెచ్చియీయఁడే
వాన సమస్తజీవులకు వాంఛిత మింపెసలార భాస్కరా.

టీ. భాస్కరా! దానము=ధర్మము, చేయన్=చేయుటకు, కోరిన వదాన్యునకున్=ఇష్టమున్న దాతకు, ఈయన్ + కన్=ఇచ్చుటకు, శక్తిలేని చోన్ + ఐనన్=సామర్థ్యములేనప్పటికిన్ని, పరోపకారమునకై=ఇతరులకు మేలుచేయుటకై, ఒకదిక్కునన్ = ఇంకొకచోటను, తెచ్చి + ఐనన్, ఈన్=ఇచ్చుటకు, పూనును = యత్నముచేయును. ఎట్లనిన, మేఘుఁడు= మబ్బు, అంబుధికిన్=సముద్రమునకు, పోయి, జలంబున్=నీటిని, తెచ్చి, సమస్తజీవులకున్=అన్నిజంతువులకు, వాంఛితము=కోరిక, ఇంపెసలు— లరన్=తృప్తికలుగునట్లుగా, వానన్, ఈయఁడే=ఒసగఁడా? (ఒసగును)

తా. మబ్బు తనయొద్ద జలములేనప్పుడు సముద్రమునకుఁ బోయి జలమును దెచ్చి యన్నిప్రాణులకోర్కెలును తృప్తిగల్గునట్లు వర్షించును. అట్లే ధర్మముచేయుట కిష్టపడు దాత తనయొద్ద దానముచేయుటకు శక్తిలేనిచో పరోపకారముకై నింకొకచోటనైన తెచ్చి యిచ్చుచుండును.

ఉ. దానముచేయనేరనియధార్మికుసంపదయుండి యుండియుఁ
దానెపలాయనంబగుట తథ్యము, బూరుగుమ్రానుగాచినన్
దానిఫలంబు లూరక వృథా పడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁ గాకయభోజ్యములౌట భాస్కరా.

టీ. భాస్కరా! దానము, చేయనేరనియధార్మికుసంపద=చేయుట కిష్టపడనిలోభివానికలిమి, ఉండియుండియుఁ=కొంతకాలమున్నట్లుండియు ను, తానె=తనంతఁదానె, పలాయనంబు—అగుట=పారిపోవుట, తథ్యము= నిజము. ఎట్లన, బూరుగుమ్రాను=బూరుగుచెట్టు, కాచినన్—ఫలించినను, వానిఫలంబులు=ఆబూరుగుపండ్లు, అభోజ్యములు=తినకూడనివి, ఔటన్= అగుటచే, ఊరక, వృథా=వ్యర్థముగా, ఎండి, గాలిచేన్, కానలలోనన్= అడవులలో, ఏమిటికిఁగాక=ఎందుకునుపయోగించక, పడిపోవు—ఎ=పడి పోవుచుండవా? (పడిపోవును.)

తా. బూరుగుచెట్టు పండినను దానిపండ్లెవరికిని దినుటకు బనికిరాక యెండి గాలిచే వృథాగా నడవులలో బడిపోవును. అట్లే, దానము చేయని వాని భాగ్యముయున్నట్లుండి యొరులకెవ్వరికి నుపయోగపడక తనంతఁ దానె మాయమగును.

చ. నడవక చిక్కి లేమియగునాఁడు నిజోదర పోషణార్థమై
యడిగిభుజించుటల్ నరుల కారయవ్యంగముకాదుపాండవుల్
గడుబలశాలు లేవురు నఖండవిభూతిఁ దొలంగి భైక్షముల్
గుడువరెయేకచక్రపురిఁ గుంతియుఁదారొకచోటభాస్కరా.

టీ. భాస్కరా! నడవక=జరుగుబాటులేక, లేమియగునాఁడు=పేద టికమువచ్చినప్పుడు, నిజ—ఉదరపోషణ—అర్థమై=తనకడుపునిండించు

కొనుటకై, అడిగి=యాచించి, భుజించుటల్=తినుటలు, ఆరయఁగ=ఆలోచింపఁగా, నరులకున్=మానవులకు, వ్యంగ్యము కాదు=నిందింపఁదగినది కాదు. ఎట్లనిన, కడుఁ బలశాలులు=మిక్కిలి బలవంతులు, ఏవురు = అయిదుగురు, పాండవుల్=పాండురాజు కొడుకులు, అఖండవిభూతిన్=సంపూర్ణమగు నైశ్వర్యమును, తొలంగి=విడిచి, ఏకచక్రిపురిన్ = ఏకచక్రిమను పురమునందు, తారును=తామును, కుంతియున్=తల్లియగు కుంతీదేవియును, ఒకచోటన్=ఒకస్థలమందు, భైక్షముల్=బిచ్చపుటన్నమును, కుడువరె=తినరా? (తినిరి.)

తా. మిక్కిలి బలశాలులగు పంచపాండవులు సంపూర్ణమగు సంపదలను విడిచి తల్లియగు కుంతీదేవితోఁగూడ నేకచక్రపురమందు భిక్షాటన మెత్తి కొన్నయన్నమును తిని జీవించిరి. కావున మనుష్యుఁడు కుటుంబము జరుగక బీదవాఁడైనప్పుడు కడుపునిండించుకొనుటకుఁ బరుల యాచించి తిని బ్రతుకుట తప్పుకాదు.

పూర్వగాథ:—పాండవులు ధృతరాష్ట్రుని యాజ్ఞచొప్పునఁ దల్లితోఁగూడి వారణావతపురమున నూతనలక్కగృహంబునఁ గాపురముండిరి. దుర్యోధనుఁడు రాజ్యాపేక్షుఁడై పాండవుల జంపింపవలయునని యూహించి "వారు నిద్రించునప్పు డాయింటిలోఁ గాల్చిరమ్ము"ని కొందఱు గూఢచారులను పంపెను. ఈవార్త విదురుఁడు పాండవులకు రహస్యముగా దెలియఁజేసెను. గూఢచారులు సమయమునకై వేచియుండ భీముఁ డాయింటిని గూఢచారులతోఁగూడ కాల్చి నిద్రలోనున్న తనతల్లిని సోదరులను యొక సొరంగమునుండి తీసికొనిపోయి యొకయడవిఁ బ్రవేశించెను. అంత నందరు నిద్రమేల్కొని భీముని సాహసమునకు సంతసించి శత్రువులకుఁ దెలియకుండ నుండగోరి సమీపమునగల యేకచక్రపురమున బ్రాహ్మణవేషముల భిక్షాటనము చేయుచు కాలముగడిపిరి.

చ. నుడువులనేర్పు చాలని మనుష్యుఁడెఱుంగక తప్పనాడినం
గడుఁగృపతోఁ దెలంగుదురు గానియదల్పరు తజ్ఞులెల్లఁద

ప్పడుగులు వెట్టుచున్నడుచు నప్పుడు బాలుని ముద్దుసేయఁగా
దొడఁగుదు రింతెకాని పడఁద్రోయుదురే యెవరైన భాస్కరా.

టీ. భాస్కరా! నుడువులన్=మాటలయందు, నేర్పు లేని, మనుష్యుఁడు, ఎఱుంగక, తప్పున్ + ఆడినన్=తప్పుపలికినచో, తజ్జ్ఞులు + ఎల్లన్=పండితులందరు, కడున్=మిక్కిలి, కృపతోన్=దయతో, వెలంగుదురు=సంతోషింతురు, కాని, అప్పుడు=కోపముతో బెదరింపరు. ఎట్లనఁగా, తప్పు + అడుగులు=తప్పటడుగులు, పెట్టుచున్=చేయుచు, నడుచునప్పుడు, బాలునిన్=పిల్లవానిని, ముద్దు చేయన్ + కాన్=ప్రేమించుటకు, తొడఁగుదురు=మొదలుపెట్టెదరు. ఇంతెకాని, ఎవరైనన్=ఎట్టిగుణములుగలవారైనను, పడన్=క్రిందపడునట్లుగా, త్రోయుదురు + ఎ=త్రోయుదురా? (త్రోయరు)

తా. ఎట్టికఠినహృదయులగు మానవులైనను, పిల్లవాఁడు తప్పటడుగులు పెట్టి నడుచునపుడు వానిని ముద్దుచేయుదురుగాని క్రిందపడఁద్రోయరు. అట్లే పండితులు మాటలయందు నేర్పులేనివాఁడు తప్పుమాటలెఱుఁగక పల్కినచో దయతో సంతోషింతురుకాని కోపముతోఁగసరరు.

ఉ. నేరిచి బుద్ధిమంతుఁ డతినీతివివేకము దెల్పినం జెడం
గారణమున్నవాని కది కైకొనఁగూడదు నిక్కమే దురా
చారుఁడు రావణాసురుఁ డసహ్యమునొందడె చేటుకాలముం
జేరువయైననాఁడు నిరసించి విభీషణుబుద్ధి భాస్కరా.

టీ. భాస్కరా! బుద్ధిమంతుఁడు = తెలివికలవాఁడు, నేరిచి=తెలిసికొని, అతినీతివివేకము=ఎక్కువయగునీతిమార్గమును, తెల్పినన్=చెప్పినచో, చెడన్=పాడగుటకు, కారణమున్నవానికిన్=హేతువుగలవానికి, అది=ఆ

నీతిమార్గము, కైకొనన్ = అవలంబించుటను, కూడదు = ఇష్ట ముండదు. నిక్కము + ఏ = నిజమే, ఎట్లనిన, దురాచారుఁడు = చెడునడతగలవాఁడు, రావణాసురుడు, చేటుకాలమున్ = చెడుకాలము, చేరువ + ఐననాఁడు = సమీపించినప్పుడు, విభీషణుబుద్ధి = విభీషణుఁడు చెప్పిననీతిని, నిరసించి = తిరస్కరించి, అసహ్యము, పొందఁడు + ఎ = పొందలేదా? (పొందెను)

తా. చెడునడతగల రావణుఁడు తనకు చేటుకాలము సమీపించుట చేతఁ దమ్ముఁడగు విభీషణుఁడు చెప్పిననీతిని తిరస్కరించి వంశనాశము పొందెను. అట్లే మానవుఁడు తనకు చెడిపోవఁ గారణమున్నప్పుడు తెలివిగల వాఁడు తెలిసికొనిన నీతిమార్గము చెప్పినచో ఆనీతిమార్గము నవలంబించుట కిష్టపడఁడు.

చ. నొగిలినవేళ నెంతటిఘనుండును దన్నొకరొక్కనేర్పుతో
నగపడిప్రోదిసేయక తనంతట బల్మికిరాఁడు నిక్కమే
జగమున నగ్నియైన గడు సన్నగిలంబడియున్న నింధనం
బెనయఁగఁద్రోచియూఁదకమఱెట్లురవుల్కొననేర్చుభాస్కరా.

టీ. భాస్కరా! నొగిలినవేళన్ = బీదతనముగలిగియున్న సమయమున, ఎంతటిఘనుండును = ఎంతటిగొప్పవాఁడయినను, తన్నున్, ఒకరు, ఒక నేర్పుతోన్ = ఒకయుపాయముతో, అగపడి = ఎదుర్పడి, ప్రోదిసేయక = పోషింపక, తనంతటన్, బల్మికిన్ రాఁడు = బలము చెందలేఁడు, నిక్కము + ఏ = నిజమే, ఎట్లనన్, జగమునన్ = లోకమున, అగ్నియైనన్, కడున్ = మిగుల సన్నగిలంబడియున్న = క్షీణించియున్నప్పుడు, ఇంధనంబున్ = పుల్లను, ఎగఁయగన్ ద్రోచి = ఎగసనద్రోచి, ఊఁదక, మఱి + ఎట్లు, రవుల్కొనన్ నేర్చున్ = మండనేర్చును.

తా. కాల్చువాఁడగు యగ్నియైనను క్షీణించియున్నప్పుడు పుల్లలను యెగసనద్రోచి యూఁదకపోయినచో మఱల రాజి మండదు. అట్లే గొప్ప

వానికి పేదఱికము వచ్చినప్పు డింకొక రొకయుపాయముచే తన్ను పోషిం కపోయినచో తనంతటతాను తిరిగి బలమును జెందలేఁడు

ఉ. పండితులైనవారు దిగువందగనుండఁగ నల్పుఁడొక్క డు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబున కేమియెగ్గగున్?
కొండొకకోఁతి చెట్టుకొనకొమ్మలనుండఁగఁ గ్రిందగండభే
రుండమదేభసింహ నికురుంబములుండవె? చేరి భాస్కరా.

టీ. భాస్కరా! పండితులు, ఐనవారు దిగువన్=క్రిందుగా, ఉండఁగన్, అల్పుఁడు=నీచుఁడు, ఒకఁడు, ఉద్దండతన్=దుష్టత్వముచే, పీఠము + ఎక్కినన్=పీఠముపైఁగూర్చుండినచో, బుధప్రకరంబునకున్=పండితసమూహమునకు, ఏమి + ఎగ్గు + అగున్ = ఏమిచెడుపుసంభవించును ఎట్లనిన, కొండొకకోఁతి=ఒకానొకవానరము, చెట్టుకొనకొమ్మలన్, ఉండఁగన్, క్రింద=ఆచెట్టుక్రింద, గండభేరుండ=గండభేరుండమనుపక్షుల యొక్కయు, మద—ఇభ=మదపుటేనుఁగులయొక్కయు, సింహ=సింహములయొక్కయు, నికురుంబములు=గుంపులు, చేరి=కూడి, ఉండవు—ఎ=ఉండవా? (ఉండును)

తా. చెట్టుక్రింద గండభేరుండాది మృగసముదాయముండఁగ నా చెట్టుకొమ్మల చివరయందొక కోఁతియున్నను నామృగముల కేమియు లోపములేదు. అట్లే పండితులు క్రిందకూర్చుండినప్పుఁ డొకనీచుఁడు దుష్టత్వముచే పీఠముమీఁద గూర్చున్నప్పటికిని, ఆపండితుల కంతమాత్రమున నేమియు కొఱఁతగలుగదు.

ఉ. పట్టుగనిక్కుచున్ మదముబట్టి మహాత్ములఁ దూలనాడినం
బట్టినకార్యముల్ చెడును ప్రాణముపోవు నిరర్థదోషముల్
పుట్టు, మహేశుఁగాదని కుబుద్ధినొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టకపోయి దక్షునికి మోసమువచ్చెఁ గదయ్య భాస్కరా.

టీ. భాస్కరా! మదముంబట్టి=గర్వముపట్టి, పట్టుగన్=పట్టుదలతో, నిస్కారుణ్=నిగుడుచు, మహాత్ములన్=గొప్పవారిని, తూలనాడినన్=నొవ్వ బల్కినచో, పట్టినకార్యముల్=ప్రారంభించినపనులు, చెడును. ప్రాణముల్, పోవు. నిరర్థదోషముల్ = కారణములేని పాపములు, పుట్టున్=కలుగును. ఎట్లనిన, మహేశున్=శివుని, కాదని=తిరస్కరించి, కుబుద్ధిన్=చెడుబుద్ధి తో, ఒనర్చినయజ్ఞతంత్రముల్=చేసినయాగకార్యములు, ముట్టక=నెఱవేరక, పోయి, దక్షునికిన్=దక్షప్రజాపతికి, మోసము=కీడు, వచ్చెన్—కద— అయ్యె=కలిగెనుకదా!

తా. ఈశ్వరుని తిరస్కరించి దక్షుఁడు చెడుబుద్ధిచే యొనర్చిన యాగము నెఱవేరక పోవుటయే గాక యతని ప్రాణములుకూడ పోయెను. అట్లే దుష్టుఁడు గర్వముచేత పట్టుదలతో నిగుడుచు మంచివారిని ధిక్కరించి తా నొకపనిఁజేయఁబూనినచో నాపని పాడగుటయే గాక ప్రాణహాని సంభవించు ను. కారణములేని పాపములు సంభవించును.

పూర్వగాథ:—1. నవబ్రహ్మలలో నొకఁడగు దక్షప్రజాపతి తనకుమా ర్తెయగు గౌరీదేవిని శివునకిచ్చి పెండ్లిచేసెను. దక్షుఁ డొకనాఁడు బ్రహ్మ సభకుపోవ నందున్నవారందఱును లేచి గౌరవించిరి. కాని శివుఁడు సమాధి లో నుండుటచేత లేవలేదు. అందులకు దక్షుడు శివుని నిందించుచు తానొక యాగమునుచేయ ప్రారంభించి యెల్లసురలనుబిల్చి ఈశ్వరుని బిలువకుండుట యేగాక యాగమునుచూడవచ్చిన గౌరీదేవిని పలుకరింపలేదు. అంత నామె ప్రాణములు వీడెను. దక్షుడు శంకరునకు హవిర్భాగమీయలేదు. ఈయవ మానములను సహింపక మహేశ్వరుఁడు వీరభద్రుని సృజించి యతనిచే దక్షుని జంపించి యాగము పాడుచేయించెను.

ఉ. పరహితమైనకార్య మతిభారముతోడిదియైనఁబూను స
త్పురుషుఁడులోకముల్పొగడ, బూర్వమునం దొకతాలవర్ష

మున్ గురియఁగఁజొచ్చినన్ గదిసి గొబ్బునగోజనరక్షణార్థమై
గిరినొక కేలనెత్తెనఁట కృష్ణుఁడు ఛత్త్రముభాతి భాస్కరా.

టీ. భాస్కరా! పరహితము=ఇతరులకు మేలుచేయునది, ఐనకార్యము=అయినట్టిపని, అతిభారముతోడిదైనన్ = మిగులఁగష్టముతోఁ గూడినదైనను, లోకముల్=జగమందలిజనులు, పొగడన్, పూనున్ = ఆకార్యముచేయ బ్రయత్నింతురు. ఎట్లనిన, పూర్వమునందు (ద్వాపరయుగమందు ఇంద్రుడు అని తెచ్చిపెట్టుకొనవలెను) ఒకతాలవర్షమున్ = ఒకరాళ్ళవాన, 2. కురియఁగఁజొచ్చినన్=వర్షించుచుండఁగా, కృష్ణుడు = శ్రీకృష్ణమూర్తి, గొబ్బునన్=వేగముగా, కదిసి = సమీపించి, గోజనరక్షణార్థమై=ఆవులను ఆలకాపరులను గాపాడుటకై, గిరిన్ = పర్వతమును, ఛత్త్రముభాతిన్=గొడుగువలె, ఒకకేలన్=ఒకచేతితో, ఎత్తెనట=పయికిబట్టుకొనెనఁను.

తా. ఇంద్రుడు శ్రీకృష్ణమూర్తిపై కోపముచే రాళ్ళవర్షమును గురిపించుచుండఁగా; కృష్ణమూర్తి గోవులను గోపాలురను రక్షించు నిమిత్తమై మిగుల కష్టమగు పనియైనను గోవర్ధనగిరి గొడుగువలె నొంటిచేతితో నెత్తెను. అట్లే మంచివారు ఎంతకష్టమైన కార్యమైనను పరోపకారముకొఱకు లోకములు మెచ్చునట్లు చేయుచుందురు.

పూర్వగాథ:—పూర్వకాలమున యాదవులందరును యేటేట "నింద్రధ్వజ"మను నుత్సవముఁజేయుచుండిరి. దానిని శ్రీకృష్ణభగవానుఁడు మాన్పించినందువలన నింద్రునకుఁగోపమువచ్చి రాళ్ళవానను గురిపించుచుండఁగా యాదవులు తలదాచుకొనుచోటులేక భయపడుచుండ కృష్ణమూర్తి గోవులను గోపాలురనురక్షించుటకై గోవర్ధనగిరి నెత్తి దానిసహాయమున యాబాధ తప్పించెను. ఇంద్రుడు కృష్ణమూర్తి మహిమకాశ్చర్యపడి యతనిని ప్రార్థించి యాతనిదయకు పాత్రుఁడయ్యెను.

2 కురియఁగఁజొచ్చినన్:— ఇటుఁ గురియుధాతువు వర్షింపించుమనను నర్థంబునఁ బ్రయోగింపఁబడినది.

చ. పలుచనిహీనమానవుఁడు పాటిదలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని మతిభాసురుఁడై నగుణపరిపూర్ణుఁ డ
ప్పలుకులఁ బల్కఁబోవఁడునిబద్ధిగ; నెట్లన వెల్తికుండఁ దాఁ,
దోలఁకుచునుండుగానిమఱితొల్కునెనిండుఘటంబు భాస్కరా.

టీ. భాస్కరా! పలుచనిహీనమానవుఁడు=ములుకఁదనముగలనీచమను జుఁడు, పాటి=న్యాయము, తలంపక, నిష్ఠుర + ఉక్తులన్=కఠినమగుపలుకులను, పలుకుచునుండుఁగాని, మతిభాసురుఁడు=బుద్ధిచేఁబ్రకాశించునట్టివాఁడు, ఐనగుణపరిపూర్ణుఁడు=అయినట్టి మంచిగుణములచే నిండినవాఁడు, ఆపలుకులన్=అటువంటిమాటలను, నిబద్ధిగన్=నిజముగా, పల్కన్ పోవఁడు=మాట్లాడబోఁడు. ఎట్లన, వెల్తికుండ=నీరుతక్కువగాఁగలకుండ, తాన్, తొలఁకుచునుండుఁగాని=తొనకుచుండును గాని, మఱి, నిండుఘటంబు=నీటిచేనిండుగాఁగలకడవ, తొల్కునె=తొనకునా? (తొనఁకదు.)

తా. వెల్తికుండ తొనఁకును గాని నీరు నిండుగాఁగలకుండ తొనకదు. అట్లే, ములుకఁదనముగల నీచుఁడు న్యాయము నెంచక కఠినపుపల్కులను పల్కును. సద్గుణములచే నొప్పారు గుణవంతుఁ డట్టి కఠినమాటలను మాట్లాడఁడు.

చ. పలుమఱుసజ్జనుండు ప్రియభాషలెపల్కుఁగఠోరవాక్యముల్,
పలుకఁడొకానొకప్పు డవిపల్కిన గీడనుగాదు, నిక్కమే
చలువకువచ్చి మేఘుఁ డొకజాడను దావడగండ్లరాల్చినన్,
శిలలగునోటు వేగిరమె శీతలనీరముగాక భాస్కరా.

టీ. భాస్కరా! సజ్జనుఁడు, పలుమఱు=అనేకసార్లు, ప్రియభాషలు + ఏ=మంచిపలుకులే, పల్కున్, కఠోరవాక్యముల్=చెడ్డమాటలు, పలు

కఁడు. ఒకానొకప్పుడు, అవి=ఆచెడ్డమాటలు, పల్కినన్, కీడును గాదు నిక్కము + ఎ=నిజమే, ఎట్లనిన, చలువకున్=చల్లఁదనమునకు, వచ్చి, మేఘుఁడు=మబ్బు, తాన్, వడగండ్లన్, రాల్చినన్=కురిపించినను, వేగిరమె, శీతలనీరము గాక=చల్లనినీళ్ళు గాక, శిలలుగనోటు=రాళ్ళగునా? (కావు.)

తా. మేఘుఁడు నీటిబిందువులనే వర్షించు. ఒకానొకప్పుడు చలువకొఱకు వడగండ్లను గురిసినను, అవి వెంటనే చల్లనైన నీళ్ళగును గాని రాళ్లుగానుండవు. అట్లే మంచివాఁడు మంచిమాటలనే పల్కును. ఒకానొకసమయమందు కఠోరవచనములు పలికినను మేలుగానగును గాని కీడుగా నుండవు.

ఉ. పాపపుఁద్రోవవాని కొకపట్టున మేను వికాసమొందినన్
లోపలదుర్గుణంబె ప్రబలుంగద నమ్మఁగఁగూడ దాతనిన్
బాపటకాయకున్ నునుపు పైపయిఁగల్గినఁ గల్గుఁగాక యే
రూపున దానిలోఁగల విరుద్ధపుఁజేదు నశించు భాస్కరా.

టీ. భాస్కరా! పాపపుఁద్రోవవానికిన్=దుర్మార్గునకు, ఒకపట్టునన్=ఒకవేళ, మేను=శరీరము, వికాసము=కాంతిని, ఒందినన్=పొందినప్పటికిని, లోపలన్=మనస్సులోపల, దుర్గుణంబు + ఎ=చెడుగుణమే, ప్రబలుంగద=వృద్ధిచెందునుగదా, ఆతనికిన్, నమ్మఁగన్, కూడదు, ఎట్లనిన, పాపటకాయకున్=పాపిడికాయకు, పైపయిన్=మీఁదమీఁద, నునుపు, కల్గినన్, కల్గుఁగాక, దానిలోన్=ఆపాపిడికాయయందు, కల=ఉన్నట్టి, విరుద్ధపుచేఁదు=వికటమగుచేఁదు, ఏరూపునన్=ఏవిధముగా, నశించున్=పోవును? (పోదు)

తా. పాపిడికాయ మీఁదిభాగము నునుపుగానుండినను దానిలోనున్న వికటమగు చేఁదుపోదు. అట్లే దుర్మార్గునకు సుందరమొకవేళకల్గియున్నను మనస్సులోఁగల చెడుగుణము ఎక్కువగును గాని పోదు. కావున వానిని నమ్మరాదు.

ఉ. పూనినభాగ్యరేఖ చెడిపోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వానినెవ్వరుఁబ్రియంబునఁబల్కరుపిల్వరెచ్చటం, దా
నిదియెట్లొకో యనినఁ దథ్యము పుష్పమువాడివాసనా, హీ
నతనొందియున్నయెడ నెవ్వరుముట్టుదురయ్య భాస్కరా.

టీ. భాస్కరా! పూనినభాగ్యరేఖ=పొందియున్న యదృష్టపురేఖ, చెడిపోయినపిమ్మటన్=తొలఁగినవెనుక, ఎట్టిమానవుండు, ఐనను, ఎచ్చటన్, వానిని, ఎవ్వరున్, ప్రియంబునన్=ఆదరముతో, పల్కరు=మాట్లాడరు. పిల్వరు=పిలువరు, తథ్యము=నిజము. తాన్, అది, ఎట్లు + ఒకో + అనినన్=ఏలాగునంటే, పుష్పము, వాడి=ఎండిపోయి, వాసనాహీనతన్=వాసనలేకపోవుటను, ఒందె=పొంది, ఉన్నయెడన్=ఉన్నప్పుడు, ఎవ్వరు, ముట్టుదురు + అయ్యా=అంటుదురా? (అంటరు)

తా. పూవుయెండి వాసనలేకపోయినప్పుడు దాని నెవ్వరును అంటుకొనరు. అట్లే మానవుం డెంతగొప్పవాఁడయినను, వాని యదృష్టరేఖ తొలఁగిపోయినచో వానితో యెవ్వరును మాట్లాడరు. వానిని పిలువరు.

ఉ. పూరిత సద్గుణంబుగని పుణ్యునకించుక రూపసంపదల్
దూరములైన వానియెడ దొడ్డగఁజూతురు బుద్ధిమంతులె
ట్లారయ గొగ్గులైన మఱి యందులమాధురిఁజూచి కాదె ఖ
ర్జూరఫలంబులంబ్రియముచొప్పడలోకులుగొంటభాస్కరా.

టీ. భాస్కరా! పూరితసద్గుణంబు=నిండుకొనియున్న మంచిగుణము, కలపుణ్యునకున్=ఉన్న పుణ్యాత్మునకు, ఇంచుక, రూపసంపదల్=సౌందర్యముగల్గుటలు, దూరములు + ఐనన్=లేకపోయినను, వానియెడన్=వానిపట్లను, బుద్ధిమంతులు, దొడ్డగన్=గొప్పగా, చూతురు. ఎట్లు=ఏలాగునంటే, ఆరయన్=ఆలోచింపఁగా, లోకులు=జనులు, గొగ్గులైనన్=మడత

తలుగలవైనను, ఖర్జూరఫలంబుగా, ప్రియముచొప్పడగ=ప్రేమగల్గునట్లుగా, కొంట = వెలకుతీసికొనుట, మఱి=ఇంకను, ఆఁకుల = ఆఘటములందున్న, మాధుర్యగ=తియ్యదనమును, చూచికాదె=చూడయేకదా ?

తా. ఖర్జూరపండ్లు పయికి గొగ్గిగొగ్గిగానున్నను వానియందుఁగల మాధుర్యమును జూచి ప్రజలు ప్రియముతోఁ గొనుచుందురు. అట్లే సద్గుణములుగలవానికి సౌందర్యము లేకుండినను బుద్ధిమంతులు వానిని గౌరవించెదరు.

ఉ. ప్రల్లదనంబుచే నెఱుకపాటొకయించుకయులేక యెచ్చటఁగా
బల్లిదుడైన సత్ప్రభు నబద్ధములాడినవారు గ్రుంగిపోదు, రె
ట్లల్ల సభాస్థలింగుమతులై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడుం
గల్లలు కృష్ణునింబలికికాదె హతంబగుటెల్ల భాస్కరా.

టీ. భాస్కరా! ప్రల్లదంబుచేతగా = వదరుఁబోతుఁదనముచే, ఎఱుకపాటు=జ్ఞానము, ఇంచుకలేక=కొంచెమైనను లేక, ఎచ్చటన్ = ఎట్టిచోటనైనను, బల్లిదుఁడు=బలవంతుఁడు, ఐనసత్ప్రభున్=అయినట్టి మంచిరాజును గూర్చి, అబద్ధములాడినగా = లేనిపోనివిచెప్పినచో, క్రుంగిపోదురు=నశింతురు. ఎట్లు=ఏలాగునన, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడున్, హతంబగుటెల్ల=చచ్చుటంతయు, అల్లసభాస్థలిగా = ధర్మరాజు రాజసూయయాగమునందలి సభలో, కుమతులై=చెడుబుద్ధిగలవారై, కృష్ణునిన్=శ్రీకృష్ణభగవానుని, కల్లలుపలికికాదె=అబద్ధములాడుటవల్ల నేకదా ?

తా. ధర్మరాజుచేయు రాజసూయయాగమునందలి సభలో శిశుపాల దంతవక్త్రులు చెడుబుద్ధిగలవారై శ్రీకృష్ణభగవానుని నిందించి యతనిచేత చంపఁబడిరి. అట్లే ఎట్టిచోటనైనను వదరుఁబోతుదనమువల్ల జ్ఞానములేనివాఁడు బలవంతుఁడగు రాజును తూలనాడిన నశింతురు.

పూర్వగాథ:— చేదిదేశాధీశ్వరుండగు శిశుపాలుండును తనతమ్ముండగు దంతవక్త్రుండును దుర్మార్గులై శ్రీకృష్ణమూర్తితో నెప్పుడును పగ సాధించుచుండిరి. ధర్మరాజు సేయు రాజసూయయాగమున కృష్ణుని పురుషోత్తమునిగా నిర్ణయించి పూజించి యగ్రతాంబూలము శ్రీకృష్ణునకిచ్చుటం జూచి వీరు సహింపక పలువిధముల నిందించుటచే శిశుపాలుని శ్రీకృష్ణమూర్తి తనచక్రముచే సంహరించి తరువాత కొన్నిదినములకు దంతవక్త్రునిం గూడఁ జంపెను.

వీరిద్దరే సనకసనందనాది మహర్షులచే శాపమునొందిన శ్రీవిష్ణుద్వారపాలకులగు జయ విజయులు. మూడవజన్మము నెత్తిరి.

ఉ. ప్రేమనుగూర్చియల్పునకుఁ బెద్దతనంబును దొడ్డవానికిం
దామతితుచ్ఛపుంబని నెదం బరికింపక యీయరాదుగా,
వామకరంబుతోడ గుడువం గుడిచేత నపానమార్గముం
దోమఁగవచ్చునే మిగులఁ దోఁచనిచేఁతలుగాక భాస్కరా.

టీ. భాస్కరా! ప్రేమనుగూర్చి=దయననుసరించి, అల్పునకున్=నీచునకు, పెద్దతనంబును=గొప్పయుద్యోగమును, దొడ్డవానికి=గొప్పవానికి, తాము=ప్రభువులైనవారు, అతితుచ్ఛపుంబని=మిక్కిలినీచపుఁబనిని, ఎదన్=మనస్సునందు, పరికింపక=ఆలోచింపక, ఈయరాదుగా=ఈయఁగూడదు కదా, ఎట్లనిన, మిగులన్=మిక్కిలి, తోఁచనిచేఁతలుకాక=ఆలోచనలేని కార్యములుగాని, వామకరంబుతోడన్=ఎడమచేతితో, కుడువన్=తినుటయు, కుడిచేతన్=కుడిచేతితో, అపానమార్గమున్=మలమువిడిచెడిచోటును, తోమఁగన్=కడుగుటయు, వచ్చునే=తగునా? (తగదు.)

తా. మానవునకు యెడమచేతితో దినుటయుఁ గుడిచేతితో మలము విడిచెడిచోటును కడుగుటయు యెట్లు యాలోచనలేని పనులో అట్లే

ప్రభువులు ప్రేమచే నీచునకు గొప్పయుద్యోగమును గొప్పవానికి నీచపుఁ బనిని యిచ్చుట యాలోచనలేని పాలనయే యగును.

చ. ఫలమతిసూక్ష్మమైనను నృపాలుఁడు మంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకులాతని కపేక్షయొనర్తు; రదెట్లు చంద్రికా
విలసనమైనఁ దామనుభవింపఁ జకోరము లానఁజేరవే
చలువగలట్టివాఁడగుటఁ జందురునెంతయుఁగోరి భాస్కరా.

టీ. భాస్కరా! నృపాలుఁడు=రాజు, మంచిగుణాఢ్యుఁడు=మంచి గుణములచేనిండినవాఁడు, ఐనచోన్, ఫలము=అతనివలనలాభము, అతిసూక్ష్మము=మిక్కిలితక్కువ, ఐనను, వివేకులు=బుద్ధిమంతులు, ఎలమిన్=సంతోషముచే, అతనికిన్=ఆరాజుకొరకు, అపేక్షయొనర్తురు = కోరుచుందురు. అది + ఎట్లు, చంద్రికావిలసనము + ఐనన్ = వెన్నెలయొక్క కాంతిమాత్రమే యైనను, చకోరములు=వెన్నెలపిట్టలు, చలువగల + అట్టివాఁడు=చల్లఁదనముకలవాఁడు, అగుటన్, ఎంతయున్=మిక్కిలి, చందురున్=చంద్రుని, కోరి, తాము=ఆపక్షులు, అనుభవింపన్ = ఆవెన్నెలకాంతినే గ్రోలుటకు, ఆనన్=అపేక్షతో, చేరవే=వెళ్ళవా? (వెళ్ళును.)

తా. వెన్నెలపిట్టలు చంద్రునివలనఁ దమకు గాంతిమాత్రమే తప్ప విశేషలాభము లేకపోయినను చల్లనివాఁ డగుటచే నాచంద్రోదయమును గోరుచుండును. అట్లే బుద్ధిమంతులు రాజు మంచివాఁ డయినచో నాతనివలన లాభమెక్కువ లేకపోయినను సంతోషముతో నాతనినే కోరుచుందురు.

ఉ. బంధురసద్గుణాఢ్యుఁ డొకపట్టున లంపటనొందియైన దు
స్సంధిఁదలంపఁడన్యులకుఁ జాలహితం బొనరించుఁగాక శ్రీ
గంధపుఁజెక్కరాగిలుచుఁగాదె శరీరుల కుత్సవార్ధమై
గంధములాత్మఁ బుట్టఁదఱుఁగంబడియుండుటలెల్ల భాస్కరా.

టీ. భాస్కరా! బంధుర=పరికాశించెడి, సద్గుణ=మంచిగుణములచే, ఆఢ్యుఁడు=నిండినవాఁడు, ఒకపట్టునన్=ఒకవేళను, లంపటన్=కష్టమును, ఒందియైన, అన్యులకున్=ఇతరులకు, చాలహితంబున్ = ఎక్కువమేలును, ఒనరించున్ కాక=చేయునుగాని, దుస్సంధిన్=చెడ్డపనిని, తలంపఁడు, ఎట్లనిన, శ్రీగంధపుఁజెక్క=మంచిగంధపుఁజెక్క, రాగిలుచున్=ప్రకాశించుచు, గంధములు=పరిమళములు, ఆత్మన్=తనలో, పుట్టన్=కలుగునట్లు, తఱుఁగంబడి=తగ్గిపోయియుండుట, ఎల్లన్=అంతయు, శరీరులకున్=దేహధారులకు, ఉత్పన్న + అర్థము=వేడుకకొఱకు, ఐకాదె=అయియేకదా! (అవును.)

తా. మంచిగంధపుచెక్క తఱుఁగబడియును తనయందు పరిమళములు ప్రకాశింపఁగా జనులకు వేడుక కలిగించును. అట్లే సద్గుణవంతుఁడొకవేళ కష్టమును పడినైనను, ఇతరులకు కీడుఁదలంపక మిక్కిలి మేలును చేయును.

చ. బలముదొలంగుకాలమునఁ బ్రాభవసంపదలెంతధన్యుఁడున్
నిలుపుకొనంగ నోపఁడది నిశ్చయ మర్జునుఁడీశ్వరాదులం
గెలిచిన వాఁడుబోయలకు గీట్పడిచూచుచుఁగృష్ణుభార్యలం
బలువుర నీయఁడే నిలువఁబట్టసమర్థుఁడుగాక భాస్కరా.

టీ. భాస్కరా! బలమున్=దైవబలమును, తొలంగుకాలమునన్, ఎంతధన్యుఁడున్ = ఎట్టిసంపన్నుఁడును, ప్రాభవసంపదలు=గొప్పవగుసంపదలు, నిలుపుకొనంగన్=అవుకొనుటకు, ఓపఁడు=చాలఁడు, అది=ఆమాట, నిశ్చయము=నిజము. ఎట్లనిన, ఈశ్వరాదులన్=శంకరుఁడు మొదలగువార్లను గెలిచినవాఁడు, అర్జునుఁడు, బోయలకున్=చెంచులకు, కీడ్పడి=లోఁబడి, చూచుచున్, కృష్ణుభార్యలన్=శ్రీకృష్ణునిభార్యలను, నిలువఁబట్టన్=ఆపియుంచుటకు, సమర్థుఁడకాక=తగినవాఁడుకాక, పలువురన్=అనేకులను, ఈయఁడే=ఈయలేదా! (ఇచ్చెను.)

తా. శివుఁడు మొదలగు వారలను గెల్చినట్టి యర్జునుఁడు శ్రీకృష్ణ నిర్యాణమైనతరువాత బోయవాండ్రకులోఁబడి కృష్ణునిభార్యలను కాపాడ లేక చాలమందిని బోయలకిచ్చెను. అట్లే దైవబలము పోయినతరువాత నెంతటి గొప్పవాఁడైనను పార్థివసంపదలు నిలుపుకొనజాలడు.

పూర్వగాథ:—బలరామ కృష్ణులు నిర్యాణము పొందినపిమ్మట వారల భార్యలను యర్జునుఁడు కాపాడుచుండెను. ఒకనాఁడు బోయలు కృష్ణునిపైనున్న కోపముతో యతని భార్యలను బలాత్కారముగాఁ దీసుకొనిపోవుచుండిరి. అప్పుఁ డర్జునుఁడు వారలతో యుద్ధముచేసి యోడిపోవ నాబోయలు కృష్ణుని భార్యలను పెక్కురను తీసుకొనిపోయిరి. శ్రీకృష్ణభగవానుని దయవలన త్రిభువనములు యర్జునుఁడు జయించెను. ఆభగవానుఁడు లేకుంటచే బోయవాండ్రనైన గెలువలేకపోయెను.

చ. బలయుతుఁడైనవేళ నిజబంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే
బలముతొలంగెనేని తనపాలిటిశత్రు; వదెట్లు పూర్ణుఁడై జ్వ
లనుఁడుకాననఁగాల్చుతఱి సఖ్యముఁజూపునువాయుదేవుఁడా
బలియుఁడు సూక్ష్మదీపమగుపట్టున నార్పదెగాలి భాస్కరా.

టీ. భాస్కరా! బలయుతుఁడు=బలముగలవాఁడు, ఐనవేళన్, నిజబంధుఁడు=తనచుట్టము, తోడ్పడుఁగాని, ఆతఁడే=ఆచుట్టమే, బలము, తొలంగెనేని=వదలినచో, తనపాలిటిశత్రువు = తనకుపగవాఁడేయగును. అది, ఎట్లు=ఏలాగునన, జ్వలనుఁడు=అగ్నిదేవుఁడు, పూర్ణుఁడై=నిండినవాఁడై, కాననన్=అడవిని, కాల్చుతఱిన్ = కాల్చెడివేళ, వాయుదేవుఁడు=గాలి, సఖ్యము = స్నేహము, చూపును, ఆబలియుఁడు = ఆయగ్నిహోత్రుఁడు, సూక్ష్మదీపము = చిన్నదీపము, అగుపట్టునన్ = అయినట్టిసమయమునందు, గాలి, ఆర్పదు+ఎ=ఆర్పదా? (ఆర్పును.)

తా. అగ్నిహోత్రుఁడు నిండుబలముగలవాఁడయి యడవిని గాల్చు సమయమున గాలిదేవుఁ డాతనికి స్నేహముజూపుచు తోడ్పడును. ఆయగ్ని చిన్నదీపమయియున్న సమయమున నాగాలిదేవుఁడే విరోధియై యార్పును. అట్లే మానవుఁడు బల్లిదుఁడైయున్న సమయమున తనచుట్టము తోడ్పడును. బలములేనప్పుడు తనచుట్టమే తనకు పగవాఁడై కీడుసేయును.

ఉ. బల్లిదుఁడైన సత్ప్రభువు పాయకయుండినఁగాని రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు సేరినఁ దేజము గల్గదెయ్యెడన్,
జల్లనిచందురుం డెడసి సన్నపుఁ జుక్కలు కోటియున్న రం
జిల్లునె వెన్నెలల్ జగము చీఁకటులన్నియుఁ బాయ భాస్కరా.

టీ. భాస్కరా ! బల్లిదుఁడు=బలవంతుఁడు, ఐనసత్ప్రభువు=అయిన మంచిరాజు, రచ్చలోన్=సభలో, పాయక=వదలక, ఉండినఁగాని=ఉండిననేగాని, చిల్లరవారు=సాధారణులు, నూఱుగురు, చేరినన్, ఎయ్యెడన్= ఎచ్చటను, తేజము=కాంతి, కలుగదు, ఎట్లనగా, చల్లనిచందురుండు=చలువనిచ్చుచంద్రుఁడు, ఎడసి=లేకుండ, సన్నపుఁజుక్కలు=చిన్ననక్షత్రములు, కోటి=కోటిసంఖ్య, ఉన్నన్, చీఁకటులు, అన్నియున్, పాయన్=పోవునట్లు, రంజిల్లును + ఎ=ప్రకాశించునా? (ప్రకాశింపవు)

తా. చంద్రుఁడులేకుండ చిన్ననక్షత్రములు కోటియున్నను చీకటులు పోవునట్లు ప్రకాశింపవు. అట్లే బలవంతుఁడగు మంచిరాజు సభలో యుండిననేగాని చిల్లరవారు నూఱుమందియున్నను కాంతికలుగదు.

చ. భుజబలశౌర్యవంతులగు పుత్రులఁ గాంచిన వారికెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు నిక్కము చేకుఱుఁ గుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రతకార్యము దీర్పఁడె తొల్లి భాస్కరా.

టీ. భాస్కరా! భుజబలశౌర్యవంతులు=బాహుబలపరాక్రమవంతులగువారు, అగుపుత్రులన్, కాంచినవారికిన్=కనినవారికి; ఎయ్యెడన్=ఏచోటనయినను, నిజహృదయ + ఈప్సిత + అర్థములు=తనమనస్సునకు ప్రియమయినకోరికలు, నిక్కము=నిజముగా, సేకుఱున్=నెఱవేఱును. ఎట్లనిన, తొల్లి=పూర్వము, కుంతిదేవికిన్, విజయబల + ఆఢ్యుఁడు=జయముచేతను బలముచేతను నిండినవాఁడు, అర్జునుఁడు, వీరపరాక్రమము=శూరులపరాక్రమము, ఒప్పన్, దేవతాగజమును=ఐరావతమును, తెచ్చి, తల్లివ్రతకార్యము, తీర్పఁడె=నెఱవేర్పలేదా? (నెఱవేర్చెను.)

తా. కుంతీదేవికి వీరపరాక్రమశాలియగు పుత్రుఁ డర్జునుండుండుట చేతనే తొల్లి యైరావతము దెచ్చి తల్లివ్రతమును నెఱవేర్చినాఁడు. అట్లే బాహుబలపరాక్రమములుగల పుత్రులను కనినవారికి యెచ్చోటనైనను మనస్సులోని కోరికలు నెఱవేఱును.

పూర్వగాథ:— ద్వాపరయుగమునందు ధృతరాష్ట్రుని భార్యయగు గాంధారిదేవి గజగౌరీవ్రతము సర్వాభీష్టప్రదమని వ్యాసునివలన విని; దాని నాచరించుటకు నైరావతములేకున్నను మంటితో దానివలె ప్రతిమనైన పుత్రులతో జేయించి వ్రతముచేసుకొనవచ్చునని చెప్ప దుర్యోధనాదులు మంటియేనుఁగను జేసిరి. గాంధారియందులకు గర్వించుచు నిర్లక్ష్యభావముచే కుంతీదేవిని పిలువకుండ వ్రతమునుజేసుకొనెను. అందులకై కుంతీదేవి విచారించుచుండ నర్జునుఁడు తల్లినోదార్చి "అమ్మా! నీతోటికోడలుచేసిన దానికి విచారింపకుము. ఆమె మంటియేనుఁగుతోఁ జేసికొనెనుగాని, నాభుజబలపరాక్రమమున నైరావతమునుదెచ్చి నీవ్రతము చేయించెద"నని చెప్పి తన ధనుర్విద్యాపాండిత్యమున నైరావతమును దేవలోకమునుండి తెచ్చి తల్లివ్రతమును నెఱవేర్చెను.

పూర్వము శచీదేవి యైరావతము నెక్కి కైలాసమునకు గౌరీదేవిని జూచుటకై వెళ్ళెను. పార్వతి యాయేనుఁగును జూచి తనకట్టి వాహనము

కావలయునని శివునిఁగోర నపుడు గణనాథుని నాకమదపు టేనుఁగుగా జేసి యొసంగెను. అంత గౌరీదేవి పదునాలుగువత్సరము లాయేనుఁగునెక్కి విహరించెను. అది మొదలు దేశతలందఱు మంటిచే నేనుఁగునుజేసి గౌరీప్రతిమ నందుంచి పదునాలుగువత్సరములు వ్రతముజేసి తమతమకోరికలను నెఱవేర్చుకొనిరి.

ఉ. భూనుతులైన దేవతలు పూర్వముకొందఱు వానివర్తనల్
మానిచరింపరో యనుచు మానవులట్లచరింపఁబోల దం
భోనిధులన్నియుం దనదుపుక్కిటబట్టెనగస్త్యుఁడంచు నా,
పూనిక కెవ్వఁడోపునదిపూర్వమహత్త్వముసుమ్ముభాస్కరా.

టీ. భాస్కరా! భూనుతులు=భూలోకజనులచే నుతింపఁబడువారు, ఐనదేవతలు, కొందరు, పూర్వము, వాని=వరుసయు, వర్తనల్=మర్యాదలను, మాని, చరింపరో=చరింపలేదా? అనుచున్, మానవులు, అట్లు=ఆదేవతలవలె, చరింపన్=వర్తించుట, పోలదు=తగదు. ఎట్లనిన, అగస్త్యుఁడు, అంభోనిధులున్నియున్ = సముద్రములన్నిటిని, తనదుపుక్కిటన్ = తన నోటిలో, పట్టెనంచున్ = ఉంచెనని, ఆపూనికకున్=ఆయగస్త్యుప్రయత్నమునకు, ఎవ్వఁడు, ఓరున్=భరించును? అది అట్లుచేయుట, పూర్వమహత్త్వముసుమ్ము=పూర్వులగొప్పతనమునుమా!

తా. పూర్వమహత్త్వమున నగస్త్యుఁడు సముద్రములన్నిటిలోని నీటిని తనపుక్కిటను పట్టెను. అట్టి ప్రయత్నము మానవులు చేయలేరు. కావున పూర్వము కొంతమంది దేవతలు చెడుమార్గముల సంచరించిరని వారివలె మానవులు చెడ్డపనులు చేయకూడదు.

పూర్వగాథ:— మిత్రావరుణులు సముద్రముదగ్గర సంచరించుచు యూర్వశిఁజూచి కామింప వారికి వీర్యస్ఖలితముగాగ దానిని కుండయందుంచ నందుండి అగస్త్య, వసిష్టులు పుట్టిరి. అగస్త్యుని యాశ్రమము వింధ్య

పర్వతము దగ్గఱ. ఈతఁడు వాతాపియను రాక్షసుని మాంసమును దిని జీర్ణముజేసికొనెను. ఇల్వలుని కోపముచే భస్మముచేసెను. వింధ్యపర్వతమును యణచివేసెను. కాలకేయులను రాక్షసులను జంపుటకునై సముద్రజలమును పుక్కిటబట్టెను.

ఉ. భూపతి కాత్మబుద్ధిమదిఁబుట్టనిచోటఁ బ్రధానులెంత ప్ర
జ్ఞాబరిపూర్ణులైనఁ గొనసాగదుకార్యము, కార్యదక్షులై
యోపినద్రోణభీష్మ కృపయోధు లనేకులుగూడి కౌరవ
క్ష్మాపతికార్యమేమయిన జాలిరెచేయఁగవారు భాస్కరా.

టీ. భాస్కరా! భూపతికిన్ = రాజునకు, ఆత్మబుద్ధి=నిజతెలివి, మదిన్=మనస్సునందు, పుట్టనిచోన్=కలుగకున్నయెడల, ప్రధానులు=మంత్రులు, ఎంతప్రజ్ఞాపరిపూర్ణులు = ఎంతగొప్పబుద్ధితోనిండినవారు, ఐనన్, కార్యము=పని, కొనసాగదు=నెఱవేఱదు. ఎట్లన, కార్యదక్షులై=పనులయందు నేర్పరులై, ఓపిన=తగియున్న, ద్రోణభీష్మకృపయోధులు=ద్రోణుడు, భీష్ముఁడు, కృపుఁడు మొదలగు వీరులు, అనేకులు, కౌరవక్ష్మాపతికార్యము= దుర్యోధనునిపనిని, చేయఁగన్=నెఱవేర్చుటకు, చాలిరె=సరిపోయినారా? (సరిపోలేదు.)

తా. కార్యాలోచనలేని దుర్యోధనునిపనిని కార్యదక్షులైన ద్రోణభీష్మకృపాచార్యాదివీరులు నెఱవేర్పలేకపోయిరి. అట్లే రాజునకు నిజమైన యాలోచనపుట్టనప్పుడు మంత్రులెంత తెలివిగలవారైనను కార్యము నెఱవేర్పలేరు.

ఉ. భూరిబలాఢ్యుఁడైనఁ దలపోయక విక్రమశక్తిచే నహం
కారమునొంధుటల్ తగవుగా దతఁడొక్కెడమోసపోవుఁగా

వీరవరేణ్యుఁ డర్జునుఁడు వింటికి నేనధికుండనంచుఁ దా
నూరక వింటి నెక్కిడఁగ నోపఁడు కృష్ణుఁడులేమి భాస్కరా.

టీ. భాస్కరా! తలపోయక=విచారింపక, భూరిబలాఢ్యుఁడు=గొప్ప బలశాలి, ఐనన్, విక్రమశక్తి చేన్=పరాక్రమబలము చేత, అహంకారమున్=నేనేగొప్పవాఁడననుగర్వమును, ఒందుటల్=పొందుటలు, తగవు గాదు=మంచిదికాదు, అతఁడు, ఒక్కెడన్=ఒకచోట, మోసపోవుఁగా=మోసపడును గదా? ఎట్లనిన, వీరవరేణ్యుఁడు=వీరులలో శ్రేష్ఠుఁడగు, అర్జునుఁడు, వింటికిన్=ధనుస్సునకు, నేను, అధికుండనంచు=గొప్పవాఁడననిపల్కుచు, కృష్ణుఁడు లేమిన్=శ్రీకృష్ణభగవానుఁడులేకుంటచే, ఊరక, వింటిన్=ధనుస్సును, ఎక్కు + ఇడఁగన్=ఎక్కుపెట్టుటకైనన్, ఓఁపడు=చాలఁడు.

తా. అర్జునుఁడు ముల్లోకములకు దానె విలువిద్యయం దధికుఁడనని గర్వము చెందుచు శ్రీకృష్ణభగవానుని నిర్యాణానంతరమున ధనుస్సు నెక్కుపెట్టుటకైనను సమర్థుఁడు కాకపోయెను. అట్లే మనుష్యుఁడు తానెంతబలముకలవాఁడైనను నేనేయందరికంటె గొప్పవాఁడనని గర్వపడరాదు. అట్టి బలశాలికూడ నొకానొక వేళయందు మోసపోవును.

ఉ. భ్రష్టున కర్థవంతులగు బాంధవులెందఱుగల్గినన్ నిజా
దృష్టము లేదుగావున దరిద్రతఁ బాపఁగలేరు; సత్కృపా
దృష్టినినిల్పి లోకుల కతిస్థిరసంపదలిచ్చులక్ష్మి యా
జ్యేష్ఠకదేటికింగలుగఁజేయుదు తోడనెపుట్టి భాస్కరా.

టీ. భాస్కరా! భ్రష్టునకున్ = పనికిమాలినవానికి, అర్థవంతులు= ధనవంతులు, అగుబాంధవుల్ = అయినట్టిచుట్టములు, కల్గినన్, నిజాదృష్టము = తనభాగ్యరేఖ, లేదుకావునన్, దరిద్రతన్ = వానిబీదతనమును, పాపన్ + కన్ + లేరు = పోఁగొట్టలేరు. ఎట్లనిన, సత్కృపాదృష్టిని =

మంచిదయతోఁగూడినచూపును, నిల్పి = ఉంచి, లోకులన్ = ప్రజలను, అతి=చాల, స్థిరసంపదలు = శాశ్వతమైనభాగ్యములు, ఇచ్చులక్ష్మి = ఇచ్చే టటువంటిలక్ష్మీదేవి, తోడనె = జెష్టతోఁగూడనె, ఫుట్టి, జెష్టకున్ =పెద్ద మ్మకు, అదేటికిన్ = అదిఏమెందులకు, కలుగఁజేయదు = భాగ్యమునీయదు?

తా. జ్యేష్ఠాదేవికి చెల్లెలై పుట్టిన లక్ష్మీదేవి ప్రజలకందరికిని సత్కృపాదృష్టిని జూచి శాశ్వతమైన భాగ్యములనిచ్చుచు జ్యేష్ఠాదేవి కేమియు భాగ్యము నీయదు. అట్లే పనికిమాలినవానికి భాగ్యవంతులగు చుట్టము లెందరున్నను వానికి భాగ్యరేఖ లేనందున బీదతనమును పోగొట్టలేరు.

చ. మదిఁదనునాసపడ్డయెడ మంచిగుణోన్నతుఁ డెట్టిహీనునిన్
వదలఁడు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించుఁగా
త్రిదశవిమానమధ్యమునఁ దెచ్చి కృపామతిసారమేయమున్
మొదలనిడండెధర్మజుఁడు మూఁగిసురావళిచూడభాస్కరా.

టీ. భాస్కరా! మంచిగుణోన్నతుఁడు=మంచిగుణములచే నధికుఁడైన వాఁడు, తనున్, మదిన్=మనస్సునందు, ఆసపడ్డయెడన్, ఎట్టిహీనునిన్= ఎటువంటినీచునైనను, వదలఁడు, మేలుపట్టునన్=మంచియావసరమున, అవ శ్యము=తప్పకుండ, మున్నుగన్=ముందుగా, ఆదరించున్ + కా=ప్రేమించునుగదా! ఎట్లనిన, ధర్మజుఁడు=ధర్మరాజు, కృపామతిన్=కరుణగలమన స్సుతో, సారమేయమున్=కుక్కను, తెచ్చి, సురావళి=దేవతాసంఘము, మూఁగి=చుట్టుకొని, చూడన్=చూచుచుండఁగా, త్రిదశవిమానమధ్యమునన్=దేవతావిమానమందు, మొదలన్=ముందుగా, ఇడఁడె = కూర్చుండఁ బెట్టఁడా! (కూర్చుండఁబెట్టెను.)

తా. ధర్మరాజు తన్ను వెంబడించి వచ్చుచున్న కుక్కను దేవత లాశ్చర్యము చెందునట్లు దేవతావిమానమునందుఁ గూర్చుండబెట్టెను. అట్లే, సు

గుణవంతుఁడు తన్నాశ్రయించినవాఁ డెంతహీనుఁడైనను వానిని విడువక మంచిసమయమువచ్చినప్పుడు తప్పకుండ ముం దాతనిని గౌరవించును.

పూర్వగాథ:—శ్రీకృష్ణభగవానుఁ డస్తమించిన పిదప ధర్మరాజు విరక్తుఁడై మనుమఁడగు పరీక్షిత్తునకుఁ బట్టముఁగట్టి తమ్ములను దానును భార్యయుఁగూడి మహాప్రస్థానయాత్ర సేయఁబూని వనమున కేగుచుండ నొక కుక్క వెంబడించి వచ్చుచుండెను. కొంతదవ్వరిగిన పిదప క్రమముగా ద్రౌపది, సహదేవుఁడు, నకులుఁడు, అర్జునుఁడు, భీముఁడు ప్రాణములఁబాసి పరలోకమున కేగిరి. కాని ధర్మరాజు సోదరాదులమృతికి వగపక కొంత దూరమేఁగునప్పటికి యాయనను దీసికొనిపోవుటకు దివ్యవిమాన మొకటి యెదురుగా దేవదూతలు తెచ్చి యందు ధర్మరాజును గూర్చుండఁ బ్రార్థించిరి. అంత ధర్మరాజు సురలు వలదని వారించుచున్నను తగిన యుత్తరము లిచ్చియొప్పించి కుక్కను ముందుగా విమానమునందు కూర్చుండఁబెట్టి తాను గూర్చుండెను. దేవత లాశ్చర్యము జెందుచుండ కుక్కమూర్తితో నున్న యముఁడు నిజస్వరూపమును జూపించి ధర్మజుని సుగుణవిశేషములను పొగడి దీవించి దేవలోకమునకు గొనిపోయెను.

**ఉ. మాటలకోర్వజాలఁ డభిమానసమగ్రుఁడు ప్రాణహానియౌ**
**చోటులనైనఁ దా నెదురుచూచుచునుండుఁ గొలంకులోపల**
**న్నీటమునింగినప్పు డతినీచములాడిన రాజరాజు పో**
**రాటమొనర్చి నేలఁబడఁడాయెనె భీమునిచేత భాస్కరా.**

టీ. భాస్కరా! అభిమానసమగ్రుఁడు=అభిమానముచే నిండినవాఁడు, ప్రాణహాని, ఔచోటులనైన, తాను, ఎదురుచూచుచునుండుఁగాని, మాటలకున్=పరులు తన్నాడెడి తిరస్కారపుమాటలకు, ఓర్వజాలఁడు=సహింపలేఁడు. ఎట్లనిన, రాజరాజు=సుయోధనుఁడు, కొలంకులోపలన్=మడుగులో, మునింగినప్పుడు=దాగియున్నప్పుడు, అతి=మిక్కిలి, నీచములాడినన్=పాండ

వులుహీనవాక్యములాడఁగా, పోరాటము=యుద్ధము, ఒనర్చి=చేసి, భీముని చేతన్, నేలన్=భూమియందు, పడఁడాయెనె=పడలేదా? (పడెను.)

తా. కౌరవులకును పాండవులకును యుద్ధమైన తరువాత దుర్యోధనుఁడు శతృభయముచే సరస్సులో జలస్తంభనవిద్యచే దాఁగియుండి పాండవులాడెడి హీనవాక్యములకు సహింపక యుద్ధముచేసి భీమునిగదచే తొడలు విఱిగి భూమిని పడిచచ్చెను. అట్లే అభిమానముగలవాఁడు ప్రాణములనైన వదలుకొనును గాని మానహానికరములగు మాటలను సహింపఁలేడు.

పూర్వగాథ:—కురుపాండవ యుద్ధములో యుభయపక్షములవారును నశించిరి. కాని పాండవసైన్య మధికముగాగలదు. దుర్యోధనుని తమ్ములు యావత్సైన్యము బంధుమిత్రులు పోగా కృతవర్మ, కృపాచార్యుఁడు, అశ్వత్థామయను యోధత్రయము మిగిలియుండెను. దుర్యోధనుఁడు వారిని సైన్యమును సమకూర్పనంపి తానొకకొలనిలో జలస్తంభనవిద్యచే దాఁగియుండెను. అది పాండవులు దెలిసికొని యచటకేగి వానికి రోషముగల్గునట్లు పరుషవాక్యములాడఁగా నంత దుర్యోధనుఁ డామాటల కోర్వలేక బయటికివచ్చి భీమునితో ఘోరసంగ్రామమొనర్చి తొడలు విఱుగగొట్టబడి ప్రాణముల వీడెను.

ఉ. మానవనాథుఁ డాత్మరిపు మర్మమెఱింగినవాని నేలినం
గాని జయింపలేఁడరులగార్ముకదక్షుఁడు రామభద్రుఁ డా
దానవనాయకున్ గెలువఁ దానెటులోపుఁ దదీయనాభికా
స్థానసుధ స్విభీషణుఁ తారొకానిచెప్పకయున్న భాస్కరా.

టీ. భాస్కరా! మానవనాథుఁడు=రాజు, ఆత్మరిపుమర్మము=ప్రాణవిరోధియొక్క రహస్యమును, ఎఱింగినవానిని, ఏలినంగాని=చేఁదీసినగాని,

అరులన్=శతృవులను, జయింపలేఁడు=గెలువజాలఁడు. ఎట్లనిన, విభీష ణుఁడు=రావణునితమ్ముఁడు, తాన్=రామునిఁజేరి, తదీయనాభికాస్థాన సుధన్ = ఆరావణుని బొడ్డునందున్న యమృతమును, చెప్పకయున్నన్, కార్ముకదక్షుఁడు=విలువిద్యయందు నేర్పరియైన, రామభద్రుఁడు = శ్రీరామ చంద్రుఁడు, తాను, ఆదానవనాయకున్=ఆరాక్షసరాజైనరావణుని, గెలువ గన్, ఎటులు + ఓపు=ఎట్లుసమర్థుఁడగును? (సమర్థుఁడుకాఁడు.)

తా శ్రీరామచంద్రునకు విభీషణుఁడు రావణునిబొడ్డునం దమృత ముకలదని చెప్పకున్నచో శ్రీరాముఁడెంత ధనుర్విద్యాప్రవీణుఁడైనను రావ ణుని సంహరింపఁజాలకయుండును. అట్లే రాజు విరోధియొక్క మర్మమెఱుఁ గినవానినిఁ జేరఁదీయకున్నచో పగవారిని జయింపజాలఁడు.

పూర్వగాథ:— రామ రావణయుద్ధమున శ్రీరామమూర్తి రావణుని శిరము లెన్నితేపలు నఱికినను తిరిగి మొలచుచుండఁగా శ్రీరామమూర్తి రావణునిఁ జంపలేక ఖిన్నుఁడైయుండ నది చూచి విభీషణుఁడు శ్రీరామ మూర్తి దరికటిగి రావణునిబొడ్డులో యమృతము గలదనియు దాని నింకింప జేయకున్న తల లట్లే మొలచుచు నాతఁడు చావఁడనియు చెప్పెను. అంత శ్రీరాముఁ డాగ్నేయాస్త్రమున రావణుని నాభిస్థానమందలి యమృతము నింకునట్లుజేసి పిదప వానితలల నఱికిచంపెను.

ఉ. మానవుఁ డాత్మకిష్టమగు మంచి ప్రయోజన మాచరించుచో
గానికి యల్పుడొక్కఁ డదిగాదనిపల్కిన వానిపల్కకై
మానఁగఁజూడఁ డాపని సమంచితభోజనవేళ నీఁగ కా
లూనినవంటకంబు దినకుండఁగనేర్చునోటుభాస్కరా.

టీ. భాస్కరా! మానవుఁడు, ఆత్మకున్ = మనస్సునకు, ఇష్టము, అగు మంచిప్రయోజనము = అనువట్టిమంచిపనిని, ఆచరించుచోన్ = చేయఁబూను నప్పుడు, అల్పుఁడు = నీచుఁడు, ఒకఁడు, కాదకన్ = ఆపనివలని లాభమెఱుఁగక, అది, కాదని = తగదని, పల్కినన్, వానిపల్కుకై = వానిమాటకొఱకు, అపనిమానఁగన్ = ఆపనివిడిచిపెట్టుటకు, చూడఁడు = ఆలోచింపఁడు. ఎట్లనిన, సముచితభోజనవేళన్ = మంచిభోజనసమయమునందు, ఈఁగకాలు + ఊనిన వంటకంబు = ఈఁగకాలు మోపినభోజనపదార్థమును, తినకుండఁగన్ = తినుటను మానుట, నేర్పగునోటు = నేర్పరితనమగునా? (కాదు.)

తా. మనుజుఁడు భుజించునట్టిసమయమున నీఁగ భోజనపదార్థముపై వ్రాలినంతమాత్రమున భోజనపదార్థమును మానక భుజించును. అట్లే మానవుఁడు తనకు హితమైనపనిని చేయుచున్నప్పుడు నీచుఁడొకండు దానియందలిబాగును దెలియలేక వద్దని చెప్పినచో యాపనిని మానరాదు.

ఉ. మానిని చెప్పిన ట్లెఱుకమాలినవాఁ డటుచేసినన్ మహా
హానిఘటించు నేఘనునికైన నసంశయముర్విపైఁ గృపా
హీనతబల్కినన్ దశరథేశ్వరుఁ డంగనమాటకై గుణాం
భోనిధి రాముఁబాసి చనిపోవఁడె శోకముతోడ భాస్కరా.

టీ. భాస్కరా! ఎఱుకమాలినవాఁడు = తెలివిలేనివాఁడు, మానిని = తన భార్య, ఎట్లు చెప్పును = ఏరీతిని చెప్పునో, అటు చేసినన్ = ఆలాగున చేసినచో, ఉర్విపైన్ = భూమిమీద, ఏఘనునకైనను = ఎంతగొప్పవానికైనను, మహాహాని = గొప్పయాపద, ఘటించున్ = సమకూడును. అసంశయము = సందియము లేదు. ఎట్లనిన, కృపాహీనతన్ = కరుణలేమిచే, పలికినన్ = రామునడవికిఁ బంపుమని చెప్పఁగా, అంగనమాటకై = భార్యయగు కైకేయి మాటకొఱకు,

దశరథేశ్వరుఁడు=దశరథమహారాజు, గుణాంభోనిధి=సుగుణములకు సముద్రమువంటివాఁడగు, రామున్=శ్రీరామచంద్రుని, పాసి=విడిచి, శోకముతోడన్=దుఃఖముచే, చనిపోఁడే=మరణింపఁడా? (మరణించెను.)

తా. దశరథుఁడు తనభార్యయగు కైకచెప్పినమాటకొరకు చక్కఁగా నాలోచింపక సుగుణాభిరాముఁడగు శ్రీరామచంద్రుని యడవికంపి యాతని వియోగమువల్ల ప్రాణములు విడిచెను. అట్లే తెలివిమాలినవాఁడు తనభార్య చెప్పినట్లు నడుచుకొన్నచోఁ దానెంత గొప్పవాఁడయినను తప్పక గొప్పయాపదల పాలగును.

చ. మునుపొనరించుపాతకమమోఘము జీవులకెల్లఁబూని యా
వెనుకటిజన్మమం దనుభవింపకదీఱదు, రాఘవుండు వా
లిని బడవేసి తామగుడ లీలయదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున వీడ్కొనఁడే తనమేను భాస్కరా.

టీ. భాస్కరా! మునుపు=పూర్వజన్మమున, ఒనరించుపాతకము=చేసినపాపము, అమోఘము=వ్యర్థముకాదు. జీవులకున్ + ఎల్లన్, పూని=ప్రయత్నించి, ఆవెనుకటిజన్మమందు=తరువాతపుట్టువులో, అనుభవింపక, తీఱదు=తప్పదు. ఎట్లనన్, రాఘవుండు=శ్రీరాముఁడు, వాలిని, పడన్ + వేసి=చంపి, తాన్, మగుడ=మరల, లీలన్=విలాసముగా, యదూద్భవుఁడు + ఐ=యాదవకులమునబుట్టి (కృష్ణావతార మెత్తి) కిరాతుచేతన్=ఎఱుకలవానిచేత, వినిశితబాణపాతమునన్=వాఁడియైన బాణముయొక్క దెబ్బచే, తనమేను=తనశరీరమును, వీడ్కొనఁడే=విడువఁడా? (విడిచెను.)

తా. శ్రీరామచంద్రుఁడు వాలిని జంపుటవలన సంభవించిన పాపఫలమును కృష్ణావతారమున నెఱుకలవాని బాణముయొక్క దెబ్బచే ననుభ

వించి శరీరమును విడిచిపెట్టెను. అట్లే ఎట్టివారికిని పూర్వజన్మమునఁజేసిన పాపము వృథాగా పోక పూని తరువాత జన్మమునందు యనుభవింపక తీరదు.

పూర్వగాథ:— గౌతముని భార్యయైన యహల్యయందు యింద్రు, సూర్యసంపర్కంబువలన నిద్దరు పుత్రులు పుట్టిరి. గౌతముఁ డావృత్తాంతము గూతురగు అంజనాదేవివలన దెలిసికొని యాపుత్రులను కోఁతులుగా శపించెను. పెద్దవాఁడు వాలి. చిన్నవాఁడు సుగ్రీవుఁడు. వాలి భార్య తార. పుత్రుఁడు అంగదుఁడు. వాలి మహాబలశాలి. తనతమ్ముని, భార్య రుమను హరించి సుగ్రీవుని రాజ్యమునుండి వెడలగొట్టెను. సీతాన్వేషణమునకై బలులు దేగునపుడు శ్రీరాముని చే సుగ్రీవుఁడు వాలిని జంపించెను. పిదప ద్వాపరయుగాంతమున శ్రీకృష్ణావతారుఁడైన శ్రీరామచంద్రుఁడు నిర్యాణముఁ జెందుట నాలోచించుచుండ నాతని కాలి బొటనవ్రేలు జంతువుగా భావించి యొకబోయవాఁడు శరమును వేయ నది నాటుటచే కృష్ణభగవానుఁడు శరీరమును విడిచెను.

ఉ. రాకొమరుల్ రసజ్ఞునిఁ దిరంబుగ మన్ననునుంచినట్లు భూ
లోకమునందు మూఢుఁదమలోపలనుంపరు; నిక్కమేకదా
చేకొని ముద్దుగాఁ జదువుచిల్కను బెంతురుగాక పెంతురే
కాకము నెవ్వరైనఁ శుభకారణసన్మునిసేవ్య భాస్కరా.

టీ. భాస్కరా! శుభకారణ = శుభము నొసంగుటకు మూలమయినవాఁడా! సన్మునిసేవ్య=మంచిమునీశ్వరులచే పూజింపఁబడువాఁడా! రాకొమరుల్ = రాజకుమారులు, మన్ననన్ = గౌరవముతో, తిరంబుగన్ = నిలుకడగా, రసజ్ఞునిన్ = రసికుని, ఉంచినట్లు, భూలోకమునందు = భూమిమీఁద, మూఢున్ = మూర్ఖుని, తమలోపలన్ = తమయింటిలో, ఉంపరు = పెట్టుకొనరు.

నిక్కమేకదా=నిజమేకదా, ఎట్లనిన, ఎవ్వరైనన్, చేకొని=చేతబట్టుకొని, ముద్దుగన్, చదువుచిల్కను=చదివెడుచిలుకను, పెంతురుగాక=పెంచెదరు గాని, కాకమున్=కాకిని, పెంతురే=పెంచెదరా? (పెంచరు.)

తా. మనుజులు ముద్దుగా చదువుచిలుకను పెంతురుకాని కాకిని పెంచరు. అట్లే భూమిమీఁద రాజపుత్రులు రసికుని స్థిరముగా గౌరవముతో తమసన్నిధినుంచుకొందురు. కాని మూఢుని జేరనీయరు.

ఉ. లోకములోన దుర్జనుల లోఁతునెఱుంగక చేయరాదు సు
శ్లోకుఁడుజేరినం గవయఁజూతురుచేయుదురెక్కసక్కముల్
కోకిలఁగన్నచోట గుమిగూడి యసహ్యపుఁగూఁతలార్చుచుం
గాకులుతన్నవే తఱిమి కాయముతల్లడమంద భాస్కరా.

టీ. భాస్కరా! లోకములోనన్=ప్రపంచమందు, సుశ్లోకుఁడు=మంచికీర్తిగలవాఁడు, దుర్జనులలోఁతును=దుర్మార్గులస్వభావమును, ఎఱుంగక, చేరరాదు=వారికడకేఁగరాదు. చేరినన్, కవయన్=కలియబడుటకు, చూతురు=ఆలోచింతురు. ఎకసక్కముల్=వేళాకోళపుమాటలను, చేయుదురు=ఆడుదురు. ఎట్లనిన, కాకులు, కోకిలన్, కన్నచోటన్=చూచినచోట, గుమిగూడి=గుంపుఁజేరి, అసహ్యపుఁగూఁతలు=చెడ్డయఱపులు, అర్చుచున్=కూయుచు, కాయము=కోకిలదేహము, తల్లడము + అందన్=వడఁకునట్లుగా, తఱిమి=వెంబడించి, తన్నవే=తన్నవా? (తన్నును.)

తా. లోకమునందు మంచివాఁడు దుర్జనుల యభిప్రాయము తెలిసికొనకుండ దగ్గఱకుచేరరాదు. అట్లు చేరినచోఁ గాకులు కోకిలను జూచినచోట గుంపుఁజేరి వినరాని యఱపుల నార్చుచు దానిదేహముకల్లడపడునట్లు వెంబడించి తన్నెడి విధముగా దుర్జనులు మంచివాని చుట్టుముట్టి యెగతాళి చేయుదురు.

ఉ. లోనుదృఢంబుగాని పెనులోభిని నమ్మి యసాధ్యకార్యముల్
కానకపూనునే నతఁడు గ్రక్కునఁగూలును నోటిపుట్టిపై
మానవుఁడెక్కిపోవ నొకమాటుబుటుక్కున ముంపకుండునే
తానొకలోఁతునం గెడసి దానఁదరింపఁగలేక భాస్కరా.

టీ. భాస్కరా! లోన=మనస్సులో, దృఢంబు గాని=ధైర్యములేని, పెనులోభిని=మిగులపేరాసగలవానిని, నమ్మి, అసాధ్యకార్యముల్=సాధింపనలవిగానిపనులను, కానక=ఎఱుంగక, పూనునేని=యత్నించినచో, అతఁడు, గ్రక్కునన్=శీఘ్రముగా, కూలును=నశించును. ఎట్లనిన, మానవుఁడు, ఓటిపుట్టిపైన్=పాఁతదైనపడవమీఁద; ఎక్కి, పోవన్, తాను = ఆపడవ, ఒకలోఁతునన్ = ఒకలోఁతు ప్రవాహమందు, కెడసి = పడి, దానిన్= ఆప్రవాహమును, తరింపన్—కన్—లేక=దాఁటలేక, ఒకమాటు=ఒకసారి, బుటుక్కునన్=బుటుక్కుమని, ముంపక + ఉండునే=ముంచివేయదా? (ముంచివేయును)

తా. పాఁతపడవమీఁద మానవుఁ డెక్కి మిగుల లోఁతుగల ప్రవాహమును దాఁట ప్రయత్నించెనేని ఆప్రవాహమునపడి దాఁటలేక ఒక్కసారి బుటుక్కున ముంచివేయును. అట్లే, మానవుఁడు దృఢచిత్తములేని లోభివానిని నమ్మి యొక గొప్పకార్యమునకుఁ బూనుకొనినచో లోభివాని మూలమున నతఁడు నశించును.

1 విశేషాంశము బుడుంగున పాఠాంతము. పుట్టి=తుంగభద్రవైపు యేఱుదాటు ప్రేమగంప, గోదావరిమండలమున నీముట్టేమిమునిఁగినది. మాన విశేషము పుట్టెడుగింజలు.

ఉ. వంచనయింతలేక యెటువంటిమహాత్ముల నాశ్రయించి నం
గొంచెమెకాని మేలుసమగూడ దదృష్టము లేనివారికిన్

సంచితబుద్ధి బ్రహ్మననిశంబును వీఁపునమోఁచునట్టి రా
యంచకుఁదమ్మితూండ్లుదిననాయెగదా ఫలమేమి భాస్కరా.

టీ. భాస్కరా! వంచన = కపటము, ఇంతలేక=కొంచెమైననుఁబూనక, ఎటువంటిమహాత్ములన్=ఎట్టిగొప్పవారిని, ఆశ్రయించినన్=సేవించినను, అదృష్టములేనివారికిన్=భాగ్యరేఖలేనివారికి, కొంచెమెకాని, మేలు=గొప్పలాభము, సమకూడదు=లభింపదు. ఎట్లనిన, సంచితబుద్ధిన్=పూర్వజన్మసంపాదితజ్ఞానము చేత, అనిశంబున్ = ఎల్లప్పుడును, వీఁపునన్=వీఁపుచేత, బ్రహ్మను=బ్రహ్మదేవుని, మోచునట్టి, 1 రాయంచకును = రాజహంసను, తమ్మితూండ్లు = తామరకాడలు, తిననాయెఁగదా = తినుటకగలెనుగదా! ఫలము=బ్రహ్మదేవుని మోయునట్టిఫలము, ఏమి=ఏమున్నది? (లేదు.)

తా. లోకముల నిర్మించెడు బ్రహ్మదేవుని తనవీపున నెల్లప్పుడును మోయుచున్న రాజహంసతామరకాడలే యాహారము గాఁ దినవలసివచ్చెను. అట్లే కపటములేక యెంతగొప్పవారిని సేవించినను భాగ్యరేఖలేని మానవునకు సాధారణఫలమేగాని గొప్పలాభము లభింపదు.

1 ఈపద్యమున నుపమానముమాత్రమే వాడెను గాని రాయంచను గల్గిన లోఁటేమియును లేదు. సంచితబుద్ధిగల్గి బ్రహ్మను మోయుట దానికే గౌరవముకదా?

ఉ. వట్టుచుఁ దండ్రి యత్యధమవర్తనుఁడైననుగాని వానికిం
బుట్టిన పుత్రకుండు తనపుణ్యవశంబున దొడ్డధన్యుఁడౌ
నెట్టన మఱ్ఱివిత్తు మునుపెంతయుఁ గొంచెముదానఁబుట్టునా
చెట్టుమహోన్నతత్వమును జెందదెశాఖలనిండి భాస్కరా.

టీ. భాస్కరా! తండ్రి, వట్టుచున్=ఎండిపోవుచు, అత్యధమవర్తనుఁడు=మిక్కిలినీచవర్తనముగలవాఁడు, ఐనను గాని, వానికిన్=అట్టితండ్రికి,

పుట్టినపుత్రకుఁడు, తనపుణ్యవశంబునన్ = తనపూర్వపుణ్యమువలన, దొడ్డ ధన్యుఁడు=గొప్పకృతార్థుఁడు, కాన్=కాఁగఁడు ఎట్టు + అనన్, మఱ్ఱి విత్తు, మునుపు=ఆదిని, ఎంతయున్, కొంచెము=చిన్నది, దానన్=ఆవిత్తన మువలన, పుట్టునా చెట్టు = పుట్టినయామఱ్ఱిచెట్టు, శాఖలన్=కొమ్మలచేత, నిండి=ఆవరింపఁబడి, మహోన్నతత్వమును=మిక్కిలిపొడవును, చెందదు + ఎ=పొందదా? (పొందును.)

తా. మఱ్ఱివిత్తనము చిన్నదైనను దానినుండిపుట్టినచెట్టు కొమ్మల చేత నావరింపబడి మిక్కిలి పొడవుగల్గియుండును. అట్లే తండ్రి యెండి పోవుచు మిక్కిలి నీచవర్తనముగలవాఁడైనను వానికిఁగల్గు కుమారుడు తన పూర్వపుణ్యమువలన గొప్పవాడు కావచ్చును.

చ. వలనుగఁగానలందుఁ బ్రతివర్షమునం బులి నాలుగైదు పి
ల్లలఁగను దూడనొక్కటి నిలంగను ధేనువు రెండుమూడునేఁ
డుల కటులైన బెబ్బులికుటుంబము లల్పము లాయెనాలమం
దలు గడువృద్ధిజెందవె యధర్మము ధర్మముదెల్పభాస్కరా.

టీ. భాస్కరా! ఇలన్=భూమియందు, వలనుగన్=యుక్తముగా, కానలందున్=అడవులలో, పులి, ప్రతివర్షమునన్=ఏఁటేఁటను, నాలుగు + ఐదు, పిల్లలన్, కనున్=ఈనును. ధేనువు=ఆవు, రెండుమూఁడునేఁడుల కున్ = రెండుమూఁడుసంవత్సరములకు, దూడనొక్కటిన్ = ఒకదూడను, కనున్=ఈనును. అటులైనన్=అలాగైనను, అధర్మమున్=పులులయన్యా యమును, ధర్మమున్=గోవులన్యాయమును, తెల్లన్ = తెలియఁబఱ్చుటకు, బెబ్బులికుటుంబములు=పెద్దపులులకుటుంబవృద్ధి, అల్పములు + ఆయె=తక్కు వయ్యెను. ఆలమందలు=ఆవులమందలు, కడున్=మిక్కిలి, వృద్ధిన్ + చెం దవె=అభివృద్ధిఁబొందవా? (అభివృద్ధిఁబొందును.)

తా. అన్యాయముగా వర్తించు పెద్దపులులు ప్రతిసంవత్సరము నాలు గైదు పిల్లలను యీనుచున్నను వాటివంశ మభివృద్ధిలోలేదు. ధర్మముగా వర్తించు గోవులు రెండుమూఁడేండ్ల కొక్కదూడ నీనుచున్నను వాటివంశ మభివృద్ధిగాయుండెను. అట్లె యధర్మబుద్ధిగలవాని వంశము నశించును. ధర్మబుద్ధిగలవాని వంశము వృద్ధిచెందును.

చ. వలవదు క్రూరసంగతి యవశ్యమొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియెగాక యెక్కువలుగూడవు, తమ్ములపాకులోపలం
గలసిన సున్నమించుకయకాక మఱించుకయెక్కువైనచో
నలుగడఁజుఱ్ఱుచుఱ్ఱుమనినాలుకపోక్కకయున్నె భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరసంగతి=చెడ్డవారితో స్నేహము, అవశ్యము=ముఖ్యముగా, వలవదు=తగదు. ఒకప్పుడు=ఒకానొకవేళ, చేయఁబడ్డచోన్=చేయబడినయెడల, కొలఁదియెకాని=కొంచెమెగాని, ఎక్కువలు, కూడవు=తగవు. ఎట్లనిన, తమ్ములపాకులోపలన్, కలసినసున్నము=రాచినసున్నము, ఇంచుకయకాక=తక్కువైననొగాని, మఱించుక=ఇఁకగొంచెము, ఎక్కువైనచోన్, నలుగడన్=నాలుగుప్రక్కలను, చుఱ్ఱుచుఱ్ఱుమని, నాలుక, పొక్కకయున్నె=పొక్కకుండునా? (పొక్కును)

తా. తమలపాకులో సున్నము కొంచముగనుండిన నేగాని యెక్కువయినచో నాలుకచుఱ్ఱుచుఱ్ఱుమని పొక్కును. అట్లే చెడ్డవారితో స్నేహము ముఖ్యముగా చేయరాదు. ఒకవేళ చేయుట తటస్థించినను కొంచెముగా నే చేయవలయునుగాని యెక్కువగా చేసినచో యపాయముగల్గును.

ఉ. వానికి విద్యచేత సిరివచ్చెనటంచును విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుగాక తనపుణ్యముచాలక భాగ్యరేఖకుం

నఁగ నెవ్వఁడోపు; సరిబో చెవిపెంచునుగా కదృష్టతా
సఁడు కర్ణభూషణము లెట్లుగడింపగనోపు? భాస్కరా.

భాస్కరా! వానికీ=ఆమనుజునకు, విద్య చేతఁ, సిరి=సంపద, అటుచుఁ=లభించెనని, విద్యఁ=చదువును, నేర్వఁ కాఁ=, పూనినఁ + పూనన్ + కాక=పట్టియత్నము చేసినను, చేయు తనపుణ్యము=తనపూర్వజన్మసుకృతము, చాలక=సరిపోకున్నచో సుఁ = అదృష్టరేఖకొఱకు, పూనఁగఁ = యత్నముచేయుటకు, ఓపుఁ=సమర్థుఁడగును. సరిపో=సరేకాని, అదృష్టతాహీనుఁడు= లేనివాఁడు, చెవిపెంచునుగాక=చెవికన్నమును పెంచగలఁడుకాని, ణముల్ = కర్ణకుండలములను, గడింపఁగఁ = సంపాదించుటకు, ఓపుఁ=ఎట్లుసమర్థుఁడగును? (సమర్థుఁడుకాఁడు.)

గా. అదృష్టములేని మానవుఁడు చెవికన్నమును బెంచినను బెంచ గాని కర్ణకుండలములను సంపాదింపలేఁడు. అట్లే విద్యచే వానికి ప్పతదని విద్య నేర్చినను నేర్చునుగాని తనపూర్వపుణ్యసుకృతము భాగ్యరేఖ సంపాదించి భాగ్యమును దెచ్చుకొనజాలఁడు.

తతపుణ్యశాలి నొకజాడను సంపద వాసిపోయి తా
తటఁబోక నెట్టుకొని యప్పటియట్లువసించియుండు; మా
ంతమునందుఁ జందురుని నన్నికళల్ పెడఁబాసిపోయినం
ంతివహింపఁడోటు? తిరుగంబడిదేహమునిండ భాస్కరా.

టీ. భాస్కరా! సంపద=భాగ్యము, సంతతపుణ్యశాలికిఁ=నిత్యమును ుచే వెలయువానిని, ఒకజాడను=ఒకరీతిగా, పాసిపోయి=తొలఁగి

తా. అన్యాయముగా వర్తించు పెద్దపులులు ప్రతిసంవత్సరము నాలుగైదు పిల్లలను యీనుచున్నను వాటివంశ మభివృద్ధిలోలేదు. ధర్మముగా వర్తించు గోవులు రెండుమూఁడేండ్ల కొక్కదూడ నీనుచున్నను వాటివంశ మభివృద్ధిగాయుండెను. అట్లే యధర్మబుద్ధిగలవాని వంశము నశించును. ధర్మబుద్ధిగలవాని వంశము వృద్ధిచెందును.

చ. వలవదు క్రూరసంగతి యవశ్యమొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియెగాక యెక్కువలుగూడవు, తమ్మలపాకులోపలం
గలసిన సున్నమించుకయుకాక మఱించుకయెక్కువైనచో
నలుగడఁజుఱ్ఱుచుఱ్ఱుమనినాలుకపొక్కకయున్నె భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరసంగతి=చెడ్డవారితో స్నేహము, అవశ్యము=ముఖ్యముగా, వలవదు=తగదు. ఒకప్పుడు=ఒకానొకవేళ, చేయఁబడ్డచోన్=చేయబడినయెడల, కొలఁదియెకాని=కొంచెమేగాని, ఎక్కువలు, కూడవు=తగవు. ఎట్లనిన, తమ్మలపాకులోపలన్, కలసినసున్నము=రాచినసున్నము, ఇంచుకయుకాక=తక్కువైననౌగాని, మఱించుక=ఇఁక గొంచెము, ఎక్కువైనచోన్, నలుగడన్=నాలుగుప్రక్కలను, చుఱ్ఱుచుఱ్ఱుమని, నాలుక, పొక్కకయున్నె=పొక్కకుండునా? (పొక్కును)

తా. తమలపాకులో సున్నము కొంచముగనుండిన మేలుగాని యెక్కువయినచో నాలుక చుఱ్ఱుచుఱ్ఱుమని పొక్కును. అట్లే చెడ్డవారితో స్నేహము ముఖ్యముగా చేయరాదు. ఒకవేళ చేయుట తటస్థించినను కొంచెముగానే చేయవలయునుగాని యెక్కువగా చేసినచో యపాయముగల్గును.

ఉ. వానికి విద్యచేత సిరివచ్చెనటంచును విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుగాక తనపుణ్యముచాలక భాగ్యరేఖకుం

బూనఁగ నెవ్వఁడోపు; సరిబో చెవిపెంచునుగా కదృష్టతా
హీనుఁడు కర్ణభూషణము లెట్లుగడింపగనోపు? భాస్కరా.

టీ. భాస్కరా! వానికీ=ఆమనుజునకు, విద్యచేతన్, సిరి=సంపద, ...చ్చెన్ + అటంచున్=లభించెనని, విద్యన్=చదువును, నేర్వన్ కాన్=...ర్పుటకు, పూనినన్ + పూనన్ + కాక=ప్రయత్నము చేసినను, చేయు...గాక, తనపుణ్యము=తనపూర్వజన్మసుకృతము, చాలక=సరిపోకున్నచో ...గ్యరేఖపన్ = అదృష్టరేఖకొఱకు, పూనఁగన్ = యత్నముచేయుటకు, ...వ్వఁడు, ఓపున్=సమర్థుఁడగును. సరిపో=సరేకాని, అదృష్టతాహీనుఁడు=...గ్యరేఖలేనివాఁడు, చెవిపెంచునుగాక=చెవికన్నమును పెంచగలఁడుకాని, ...భూషణముల్ = కర్ణకుండలములను, గడింపఁగన్ = సంపాదించుటకు, ...్లు + ఓపున్=ఎట్లుసమర్థుఁడగును? (సమర్థుఁడుకాఁడు.)

తా. అదృష్టములేని మానవుఁడు చెవికన్నమునుఁ బెంచినను బెంచ...్చునుగాని కర్ణకుండలములను సంపాదింపలేఁడు. అట్లే విద్యచే వానికి ...పదవచ్చినదని విద్య నేర్చినను నేర్చునుగాని తనపూర్వపుణ్యసుకృతము ...సుండ భాగ్యరేఖ సంపాదించి భాగ్యమును దెచ్చుకొనజాలఁడు.

సంతతపుణ్యశాలి నొకజాడను సంపద వాసిపోయి తా
నంతటఁబోక నెట్టుకొని యప్పటియట్లువసించియుండు; మా
సాంతమునందుఁ జందురుని నన్నికళల్ పెడఁబాసిబోయినం
గాంతివహింపఁడోటు? తిరుగంబడి దేహమునిండ భాస్కరా.

టీ. భాస్కరా! సంపద=భాగ్యము, సంతతపుణ్యశాలికిన్=నిత్యమును ...ణ్యముచే వెలయువానికి, ఒకజాడను=ఒకరీతిగా, పాసిపోయి=తొలఁగి

పోయి, తాన్=అభాగ్యము, అంతటంబోక = అంతమాత్రమున నే విడువక, నెట్టుకొని=పొమకొని, అప్పటియట్లు=మునుపటివలె, వసించియుండు=నివసించియుండును. ఎట్లనిన, మాసాంతమునందున్=అమావాస్యనాడు, చందురునిన్=చందమామను, అన్నికళల్=కళలన్నియు, పెడంబాసిపోయినన్=తొలంగిపోయినను, తిరుగంబడి=మరల, దేహము=బింబము, నిండన్=నిండునట్లుగా, కాంతిన్=తేజస్సును, వహింపంజాలడా=పొందండా? (పొందును.) (ఓటుయన వ్యాఖ్యార్థము)

తా. చంద్రకళలన్నియు నమావాస్యనాంటికి విడిపోయినను తాను బ్రతిదినమును దేవతలకుం దనకళలనిచ్చెడి పుణ్యమువలన తిరిగి క్రమముగా కళలను తనబింబమునిండ పూర్ణముగా గాల్చును. అట్లే ఎప్పుడును పుణ్యములొనర్చువాని నొకవిధముగా సంపద విడిచిపోయినను ఆతం డొనరించిన పుణ్యముచే దిరిగి యాసంపదలం బొందగలండు.

చ. సకలజనప్రియత్వము నిజంబుగంగల్గిన పుణ్యశాలి కొ
కొ్కకయెడ నాపదైనం దడవుండదు వేగమె పాసిపోవుంగా
యకలుషమూర్తియైన యమృతాంశుండు రాహువు తన్ను
మ్రింగినం, డకటకమానియుండండె? దృఢస్థితి నెప్పటియట్ల
భాస్కరా.

టీ. భాస్కరా! సకలజనప్రియత్వము=సకలజనుల ప్రేమకుందగినవాండై యుండుట, నిజంబుగన్, కల్గినపుణ్యశాలికిన్=కలయట్టిపుణ్యాత్మునకు, ఒకొ్కకయెడన్=ఒకసమయమందు, ఆపద, ఐనన్, తడవుఉండదు=చాలకాలముండదు. వేగమె, పాసిపోవుంగా=తొలంగిపోవునుగదా. ఎట్లనిన, అకలుషమూర్తి=నిర్మలమైనయాకారముగలవాండు, ఐనయమృత + అంశుండు=ఐనట్టిచంద్రుండు, రాహువు=రాహుగ్రహము, తన్నున్, మ్రింగినన్, టక

టక=తొంపరపాటును, మాని, దృఢస్థితిఁ=స్థిరమైనయునికిచే, ఎప్పటి యట్ల=పూర్వరీతినే, ఉండఁడె=ఉండఁడా? (ఉండును.)

తా. నిర్మలమూర్తిగల చంద్రుఁడు తాను రాహువుచే మ్రింగబడి కాంతిలేనివాఁడైనను తిరిగి కొలఁదికాలములోనే తొందరపాటునుమాని పూర్వరీతిగానే కాంతినిఁబొందుచున్నాఁడు. అట్లే సర్వజనులకు ప్రియుమైన పుణ్యాత్ముఁడొకపట్టున కష్టములఁబొందినను వెంటనేయాకష్టములనుండి విముక్తుఁడై పూర్వరీతిగనే సుఖములొందును.

పూర్వగాథ:—రాహువు సింహికయను రాక్షస స్త్రీ పుత్రుఁడు పూర్వము సముద్రమునుమథించి సంపాదెంచిన యమృతమును పంచుకొనుటకు దేవదానవులు కలహించుచుండగా శ్రీమహావిష్ణువు జగన్మోహనావతారమున వారల కమృతము పంచిపెట్టెదనని చెప్పి దేవతల నొకవైపునను రాక్షసుల నొకవైపునను గూర్చుండఁబెట్టి ముందుగా దేవతల కమృతమును పోయు చుండెను. అదిగని రాహువు దేవతారూపము ధరించి దేవతలవంక్తిలో గూర్చుండి యమృతముఁ గ్రోలుచుండ సూర్యచంద్రులీవిషయమును విష్ణువునకు సంజ్ఞ చేఁదెలుప వెంటనే విష్ణువు తనచక్రముతో రాహువుశిరస్సును ఖండించెను కాని అమృతసంపర్కమున వాఁడు చావక తల రాహువుగను మొండెము కేతువుగను నాయెను. ఈవైరముచే రాహువు చంద్రుని, కేతువు సూర్యుని గబళించుచుందురు దానికే చంద్రగ్రహణమనియు సూర్యగ్రహణ మనియు పేరులు కలిగెను.

ఉ. సన్నుత కార్యదక్షుఁ డొకచాయనిజప్రభయుప్రకాశమై
యున్నపుడైన లోకులకు నొండొక మేలొనరించు సత్వసం
పన్నుఁడు భీముఁడాద్విజులప్రాణముకావఁడె యేకచక్రమం
దెన్నికగా బకాసురుని నేపునరూపఁడగించి భాస్కరా,

టీ. భాస్కరా! సన్నుతకార్యదక్షుఁడు=పొగడఁబడిన కార్యమునందు సమర్థుఁడైనవాఁడు, ఒకచాయన్=ఒకప్రక్క, నిజపరిభ=తనపరితాపము, అపరికాశము + ఐ=బయలుపడనిదై, ఉన్నప్పుడైనన్, లోకులకు=జనులకు, ఒండొక మేలు=ఒకానొకయుపకారము, ఒనరింమన్=చేయును. ఎట్లనిన, సత్త్వసంపన్నుఁడు=బలముచేనిండినవాఁడగు, భీముఁడు, ఏకచక్రమందు= ఏకచక్రపురమున, ఎన్నికగాన్ = ప్రసిద్ధముగా, బకాసురుని=బకుఁడను రాక్షసుని, ఏపునన్=పరాక్రమముచే, రూపు + అడగించి=చంపి; అద్విజులప్రాణములు=ఆబ్రాహ్మణులప్రాణములను, కావఁడె = కాపాడఁడా! (కాపాడెను.)

తా. భీముఁడు పూర్వమేకచక్రపురంబున తనక్షాత్రధర్మమును వదలి బ్రాహ్మణవేషముతో బిచ్చమెత్తుకొనుచుండినను ప్రసిద్ధిగా బకాసురుఁడను రాక్షసుని జంపి యాయూరి బ్రాహ్మణులప్రాణములను గాపాడెను. అట్లే లోకమున పొగడబడు కార్యదక్షుఁడొకప్పుడు తాను పరితాపహీనుఁడై యున్నను మానవులకేదో యొకయుపకారమునే చేయుచుండును.

పూర్వగాథ:—బకాసురుఁడను రాక్షసుఁడేకచక్రపురము సమీపాటవిలో చేరియుండి యొక్కమాటా గ్రామవాసులనందఱిని దినుటకు పూనుకోఁగా యాబ్రాహ్మణులు సాంఘికమరణమును సహింపలేక ప్రతిదినమొక్కొకఁడు బండెడన్నమును రెండుదున్నపోతులను తోలుకొనిపోయి బకాసురున కాహారమగునట్లు ఒడంబడికచేసికొని యావిధముగా గడుపుచుండిరి. ఇట్లుండ యాయూర బ్రాహ్మణవేషములతో నివసించియున్న పాండవులుండెడి యింటి బ్రాహ్మణుని వంతువచ్చెను. అందుల కాయింటివారు శోకింపుచుండఁగా పాండవులతల్లియగు కుంతీదేవి యాయుదంతము విని వానికి బదులుగా తనకొడుకగు భీమునిఁబంపెను. అంత భీమసేనుఁడు బకాసురునిఁ జంపి యాబ్రాహ్మణుని ప్రాణమేగాక యాయూరివారియందఱి ప్రాణములను రక్షించెను.

చ. సరసగుణ ప్రపూర్ణునకు సన్నపుదుర్గుణ మొక్కవేళయం
దొరసిన నిట్లు నీకుఁదగునో యని చెప్పిన మానఁనేర్చుఁగా
బురదయొకించుకంత తముఁబొందినవేళల జిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున నుండవె నీరములెల్ల భాస్కరా.

టీ. భాస్కరా! సరసగుణప్రపూర్ణునకున్ = మనోహరమైన గుణములచేనిండినవానికి, సన్నపుదుర్గుణము=చిన్న చెడ్డగుణము, ఒక్కవేళయందు, ఒరసినన్=కలిగినచో, ఇట్లు, నీకున్ + తగున్ + ఓ=నీకుతగునా? అని చెప్పినన్, మానన్ + నేర్చున్ + కా=మానివేయునుగదా, ఎట్లనిన, బురద, తాన్, ఒకించుకంత=కొంచెము, తమున్=జలమును, పొందినవేళలన్=అంటినసమయమునందు, చిల్లవిత్తు=ఇండుపుగింజ, పైన్=కమపైని, ఒరసినన్=తాఁకినచో, నీరములు + ఎల్లన్=నీళ్ళన్నియు, నిర్మలత్వమునన్=పరిశుభ్రతతో, ఉండవె=ఉండవా? (ఉండును.)

తా. నీళ్ళు యొకప్పుడు బురదగలవై యున్నను యిండుపుగింజగంధముందులోఁ గలిపిన నాబురదపోయి శుభ్రముగానుండును. అట్లే సద్గుణవంతున కొక్కవేళ చిన్న చెడుగుణము సంప్రాప్తమయినయెడల యిది నీకు తగదని యెవ్వరు చెప్పినను విని చెడుగుణమును మానును.

చ. సరసదయాగుణంబుగల జాణమహిం గడునొచ్చియుండి
యుం దలచుగ వానికాసపడి డాయఁగవత్తురు లోకులెట్లనం
జెఱకురసంబు గానుగను జిప్పిలిపోయినమీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁ జేరవె ముదంబునఁజీమలుపెక్కు భాస్కరా.

టీ. భాస్కరా! సరసదయాగుణంబు=మంచిదయతోఁగూడిన స్వభావము, కలజాణ=కలిగిన నేర్పరి, మహిన్=భూమియందు, కడున్=మిక్కిలి, నొచ్చియుండియున్=బాధపడియున్నను, తలచుగన్, లోకులు=ప్రజలు, వానికిన్=ఆబాధపడువానికి, ఆసపడి, డాయన్ + కన్ + వత్తురు=దగ్గఱకు జేరుదురు. ఎట్లనిన్, గానుగన్=గానుగవలన, చెఱకురసంబు, చిప్పిలి

పోయిన = కాఁటిపోఁగా, మీఁదన్ = పిదప, పిప్పియై = రసము లేనిదై, ధరన్ = నేలమీఁద, పడియున్నన్, పెక్కు చీమలు, ముదంబునన్ = సంతోషముతో, చేరవె = మూఁగవా? (మూఁగును)

తా. చెఱకుగడయొక్క రసమంతయు గానుఁగుయందు దీయఁబడిన పిదప నా పిప్పి నేలమీఁదపడియున్నను సంతోషముతో చాల చీమలు చేరును. అట్లే భూమియందు మంచి దయాస్వభావముగలదాత దరిద్రుఁడై బాధపడుచున్నను, ప్రజలు వానిమీఁద వాళ పెట్టుకొని దగ్గరకు చేరుదురు.

ఉ. సారవివేకవర్తనల సన్నుతికెక్కిన వారిలోపలం
 జేరినయంత మూఢులకుఁ జేపడ దానడ; యెట్టులన్నఁ గా
 సారములోన హంసగతినుండెడి కొంగపిట్టకే
 తీరునగల్గఁనేర్చును దదీయగతుల్ దలపోయ భాస్కరా.

టీ. భాస్కరా! సారవివేకవర్తనలన్ = బలమైన యుక్తాయుక్త జ్ఞానముగలనడకలచే, సన్నుతికిన్ = ప్రసిద్ధికి, ఎక్కినవారిలోపలన్ = వచ్చినవారియందు, చేరినయంతన్ = చేరినంతమాత్రమున, మూఢులకున్ = తెలివిలేనివారలకు, ఆనడ = మంచివారిప్రవర్తనము, చేపడదు = లభింపదు. ఎట్టులన్నన్ = ఏలాగుననఁగా, కాసారములోనన్ = చెరువులో, హంసముఃసంగతిన్ = హంసలస్నేహముతో, ఉండెడికొంగపిట్టకున్ = ఉన్నట్టికొంగకు, తదీయగతుల్ = ఆహంసలనడకలు, తలపోయన్ = ఆలోచింపఁగా, ఏతీరునన్ = ఏలాగున, కల్గనేర్చును = కలుగును? (కలుగవు.)

తా. కొలనిలో హంసలతోఁ గలసి యున్నంతమాత్రమున కొంగ కాహంసల నడకలు ఏవిధముగా రావో; అట్లే బలమైన యుక్తాయుక్త జ్ఞానముగల నడకలచే ప్రఖ్యాతిఁబొందిన మానవులతో స్నేహము చేసినంతమాత్రమున మూఢుల కామంచివారి నడవడి లభింపదు.

చ. స్థానము తప్పివచ్చునెడఁ దానెటువంటిబలాఢ్యుఁడున్ నిజ
 స్థానికుఁడైన యల్పునికతంబుననైన నను మోసపోవుఁగా

కానలలోపలఁ వెడలి గంధగజంబు నొకనాఁడు నీటిలోఁ
గానక చొచ్చినఁ *మొసలికాటులలోఁబడదోటు భాస్కరా.

టీ. భాస్కరా! తాన్, ఎటువంటిబలాఢ్యుఁడున్=ఎంతబలముగల వాఁడయినను, స్థానముఁ=తనతావును, తప్పి=విడిచి, వచ్చినెడఁ=వచ్చి నప్పుడు, నిజస్థానికుఁడు=తనతావునందున్నవాఁడు, ఐనయల్పునికతంబున నైనఁ=అయినట్టినీచునివలననైనను, మోసపోవుఁగా=వంచింపఁబడునుగదా, ఎట్లనిన, గంధగజంబు= మదించినగజేంద్రుఁడు, ఒకనాఁడు, కానలలోప లఁ=అడవులనుండి, వెడలి=బయలుదేరి, కానక=చూడక, నీటిలో, చొచ్చి నఁ=ప్రవేశింపఁగా, మొసలికాటుకుఁ=మొసలియొక్కకాటునకు, లోఁబడ దోటు=లొంగలేదా? (లొంగినది.)

తా. మదించిన గజేంద్రుఁడు తాను నివసించు యడవిని విడిచివచ్చి చూడకుండ నీటిలో ప్రవేశించినంతమాత్రమున మొసలికి లొంగిపోయినది. అట్లే మానవుఁ డెంతబలముగలవాఁడైనను తనస్థానమును విడిచి వచ్చినప్పుడు స్వస్థలమందున్న యల్పునిచే వంచింపఁబడును.

*విశేషాంశము:— "మొసలికాటుకు లోఁబటదోటు" ఇది తప్పు; "మొసలికాటునకుఁ లోబటదోటు" అని ప్రయోగించ ఛందోభంగ మగును.

పూర్వగాథ:— పాలసముద్రములో త్రికూటంబను పర్వతమందు గజేంద్రుఁడు తనకోఁటి స్త్రీ గజంబుల పెక్కింటిని వెంటగొని విహరించుచు దప్పిగొని యొకమడువులో దిగి నీరు త్రావుచుండెను. అందున్న మొసలి యొకటి వచ్చి గజేంద్రుని బంధింపఁగా కరిమకరంబులు రెండు నొండొండు సముద్దండదండంబులై వేయివత్సరములు ఘోరసంగ్రామం బాచరించెను. స్వస్థానమందుంటచే నకరి విజృంభింప గజేంద్రునకు శక్తి లేక శ్రీమహా

విష్ణువును ప్రార్థించెను. వెంటన శ్రీహరి కరిమొర నాలించి సరసివరి కరు దెంచి చక్రముచే మకరిని సంహరించి గజేంద్రుని రక్షించెను.

చ. సిరిగలవాని కెయ్యెడలఁ జేసినమేలది నిష్ఫలంబగున్
నెఱి గుఱికాదు పేదలకు నేర్పునఁజేసిన సత్ఫలంబగుఁ
వఱపునవచ్చి మేఘుఁడొకవర్షము వాడినచేలమీఁదటం
గురిసినఁగాక యంబుధుల గుర్వఁగనేమిఫలంబుభాస్కరా.

టీ. భాస్కరా! సిరి=సంపద, కలవానికిన్, ఎయ్యెడలన్=ఏసమయములయందును, మేలు, చేసినన్=చేసినచో, అది=ఆచేసినమేలు, నిష్ఫలంబగున్=లాభములేకపోవును నెఱి=పూర్తియైన, గుఱికాదు=లక్ష్యముండదు. పేదలకున్=బీదవారికి, నేర్పునన్=ఉపాయముచేత, చేసినన్=మేలుచేసినచో, సత్ఫలంబు=మంచి లాభముగలది, అగున్, ఎట్లనిన, మేఘుఁడు=మబ్బు, వఱపునన్=వర్షములేనిసమయమున, ఒకవర్షము=ఒకవాన, వాడిన చేలమీఁదటన్=ఎండుచున్నసస్యములపై, కురిసినఁగాక, అంబుధులన్=సముద్రములయందు, కుర్వఁగన్ = వర్షింపఁగా, ఏమిఫలంబు = ఏమిలాభము? (లాభము లేదు )

తా. మేఘుఁడు వానలులేక యెండిపోవుచున్న సస్యములపై వర్షించినచో లాభముండును గాని సముద్రములలో వర్షించిన లాభమేమియునుండదు. అట్లే మానవుఁడు బీదవారికి మేలు చేసిన మంచిలాభముగల్గును. గాని భాగ్యవంతులకు మేలు చేసిన లాభమేమియు గలుగదు.

చ. సిరివలెనేని సింహగుహచెంత వసించినఁజాలు సింహముల్
కరులవధింపఁగా నచటఁ గల్గునుదంతచయంబు ముత్యముల్
హరువుగ నక్కబొక్కకడ నాశ్రయమందిన నేమిగల్గెడుం
గొఱసెలుదూడతోకలునుగొమ్ములునెమ్ములుఁగాక భాస్కరా.

టీ. భాస్కరా! సిరి=సంపద, వలెనేని=కావలసియున్నచో, సింహగుహ చెంత=సింహము వసించిన గుహసమీపమున, వసించినన్=నివసించినచో, చాలున్=పరిపోవును. ఏమన, సింహముల్, కరులన్=ఏనుఁగులను, వదింపఁగాన్=చంపుటచే, దంతచయంబు=ఏనుఁగుదంతపుప్రోఁగు, ముత్యముల్=ఏనుఁగుకుంభస్థలములందలిముత్తెములు, అచటన్=ఆతావున, కల్గును. హరువుగన్=బాగుగా, నక్కబొక్కకడన్=నక్కవసించుకన్నము దగ్గఱ, ఆశ్రయము + అందినన్ = కనిపెట్టుకొనియున్నచో, గొరిసెలు=గిట్టలును, దూడతోఁకలును, కొమ్ములున్, ఎమ్ములు=ఎముకలు, కాక=తప్ప, ఏమికల్గెడున్=ఏమిదొరకును? (ఏమియుదొరకవు.)

తా. భాగ్యము గోరువారు సింహముగుహ చెంతకుపోయిన యది సంహరించిన యేనుఁగులయొక్క దంతములును, వాటికుంభస్థలములందలి ముత్యములు దొరకును. కాని నక్కవసించెడి కన్నము దగ్గఱకుపోయినచో దూడతోఁకలు, కొమ్ములు, యెముకలు తప్ప మఱేమియు దొరకవు. (కావున గొప్పవారి నాశ్రయించిన లాభముండును గాని నీచుల నాశ్రయించిన లాభము గలుగదు.)

చ. స్థిరతరధర్మవర్తనఁ బ్రసిద్ధికినెక్కినవాని నొక్కము
ష్కరుఁ డతినీచవాక్యములఁగాదనిపల్కిన నమ్మహాత్ముఁడుం
గొఱతవహింపఁడయ్యెడ, నకుంఠితపూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁ గాకిరెట్టయిడినందున కేమికొఱంతభాస్కరా.

టీ. భాస్కరా! ఒక్కముష్కరుఁడు=ఒకమూఢుఁడు, స్థిరతర=మిక్కిలిస్థిరమైన, ధర్మవర్తనన్=న్యాయప్రవర్తనచేత, ప్రసిద్ధికిన్ + ఎక్కినవానిన్=పేరుఁబడినవానిని, అతినీచవాక్యములన్=మిక్కిలిహీనములగు మాటలచేత, కాదు + అని=తిరస్కరించి, పల్కినన్, అయ్యెడన్=ఆసమయ

మందు, అమ్మహాత్ముఁడుఙ్=ఆగొప్పవాఁడు. కొఱఁతక్ = లోపమును, వహింపఁడు=పొందఁడు. ఎట్లనిన, కాకి, అరుగుచుక్=ఆకాశమునుండి పోవుచు, అకుంఠిత=ఎక్కువ, పూర్ణ=నిండినదైన, సుధాపయోధిలోక్=అమృతసముద్రములో, రెట్ట, ఇడినందునన్=వేసినంతమాత్రమున, ఏమికొ అంత= ఆసముద్రమునకు లోపమేమి? (లోపము లేదు.)

తా. అమృతసముద్రముమీఁదుగా యెగిరిపోవుకాకి యాసముద్రమున రెట్టవేసినంతమాత్రమున సముద్రమున కేమియు లోపము లేదు. అట్లే ధర్మప్రవర్తనముచే పేరుఁగాంచిన మానవుని లోకనీచుఁడు మిక్కిలి నీచమగు మాటలచేత తిరస్కరించినంత మాత్రమున యాధర్మాత్మునకు లోపము కలుగదు.

చ. సిరిగలనాడు లభ్యమగు చిత్తమునందుఁ దలంచినంతనే
నరులకు నెట్టికార్యమయినన్ జతకాదు బహుప్రయత్నముల్
జరిపిననైన లేమియెడ సత్యము సుమ్మిది; ‘చేతికందు పం
డరయఁగ దోటికందదుగదా’ యనుసామ్యముపోల్కి భాస్కరా.

టీ. భాస్కరా! నరులకున్=మనుష్యులకు, సిరి, కలనాఁడు=కలిగినప్పుడు, ఎట్టికార్యము=ఎటువంటిపని, అయినన్, చిత్తమునందు=మనస్సున, తలంచినంతనె, లభ్యము=పొందదగినది, అగున్, లేనియెడన్=భాగ్యములేనప్పుడు, బహుప్రయత్నముల్=అనేకయత్నములు జరిపినన్, ఐనన్, జత కాదు=కూడిరాదు. ఎట్లనిన, అరయఁగన్=ఆలోచింపఁగా, ఇది, చేతికి, అందుపండు=అందునట్టిఫలము, దోఁటికి = దొంకెనకైనను, అందదుకదా! అనుసామ్యము=అనిచెప్పుసామెత, సత్యముసుమ్ము=నిజమేసుమా!

తా. ‘ఒకప్పుడు చేతికందినపండు మఱియొకప్పుడు దోఁటికందదు’ అనులోకోక్తివలె మానవులకు సంపదకలనాఁడు యెంత గొప్పపనియైనను దలంచినంతమాత్రముననే సమకూడును. సంపద లేనప్పు డెంతప్రయత్నము చేసినను సమకూడదు.

స్ఫురతర కీర్తిమంతులగు పుత్త్రులఁగాంచినఁగాక మూఢము
ష్కరులఁగనంగఁ దేజములు గల్గవుగా; మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టినందున వికాసముగల్గునటయ్య? భాస్కరా.

టీ. భాస్కరా! స్ఫురతరకీర్తిమంతులు=మిక్కిలిప్రకాశించు కీర్తి గలవాఁడు, అగుపుత్త్రులన్=అయినకొడుకులను, కాంచినన్ + కాక=కనిన గాని, మూఢముష్కరులన్=జ్ఞానహీనులైనమూఢులను, కనంగన్=కని నను, తేజములు=ప్రతిష్ఠలు, కల్గవుగా, ఎట్లనిన, మణి=రత్నములచేత, కీలిత=కూర్పఁబడిన, అంగుళ + ఆభరణములు=ఉంగరములు, అంగుళంబు లన్=వ్రేళ్ళయందు, శుభస్థితిన్=శుభకరముగా, పెట్టినన్ + కాక=ధరించి నఁగాని, గాజుటుంగరములు, పెట్టినందునన్, వికాసము=కాంతి, కల్గునట య్యా=కలుగునా? (కలుగదు.)

తా. చేతివ్రేళ్ళయందు మణులచేఁగూర్పఁబడిన యుంగరము ధరించి నచో చేతికిఁ గాంతికల్గునుగాని గాజుటుంగరము ధరించిన కాంతి కలుగదు. అట్లే మిక్కిలి కీర్తిగలపుత్త్రులను కనినచో ప్రతిష్ఠలుకలుగునుగాని జ్ఞాన హీనులయిన మూఢులను కనినప్రతిష్ఠలు కలుగవు.

ఉ. సేనగవాంఛితాన్నము భుజింపఁగలప్పుడుకాక లేనిచో
మేనులుడస్సియుంట నిజమేకద దేహులకగ్నిహోత్రుఁడౌ
నేనికభోజ్యముల్ గుడుచునేనియుఁ బుష్టివహించు లేనినా
దూనివిభూతిలోనడఁగియుండడె తేజముతప్పి భాస్కరా.

టీ. భాస్కరా! సేనగన్=ఎక్కువఁగా, వాంఛిత + అన్నము=కోరి నయన్నము, భుజింపఁగలప్పుడు= తినుచుట్టివేళయందు, కాక=తప్ప, లేని చోన్=అట్టియన్నములేనప్పుడు, దేహులకున్ = ప్రాణికోటికి, మేనులు=

మందు, అమ్మహాత్ముఁడున్ = ఆగొప్పవాఁడు. కొఱఁతన్ = లోపమును, వహింపఁడు=పొందఁడు. ఎట్లనిన, కాకి, అరుగుచున్=ఆకాశమునుండి పోవుచు, అకుంఠిత=ఎక్కువ, పూర్ణ=నిండినదైన, సుధాపయోధిలోన్=అమృతసముద్రములో, రెట్ట, ఇడినందునన్=వేసినంతమాత్రమున, ఏమికొఱంత= ఆసముద్రమునకు లోపమేమి? (లోపములేదు.)

తా. అమృతసముద్రముమీఁదుగా యెగిరిపోవుకాకి యాసముద్రమున రెట్టవేసినంతమాత్రమున సముద్రమున కేమియు లోపములేదు. అట్లే ధర్మప్రవర్తనముచే పేరుఁ గాంచిన మానవుని కొకనీచుఁడు మిక్కిలి నీచమగు మాటలచేత తిరస్కరించినంత మాత్రమున యాధర్మాత్మునకు లోపము కలుగదు.

చ. సిరిగలనాఁడు లభ్యమగు చిత్తమునందుఁ దలంచినంతనే
నరులకు నెట్టికార్యమయినన్ జతకాదు బహుప్రయత్నముల్
జరిపిననైన లేమియెడ సత్యము సుమ్మిది; 'చేతికందు పం
డరయఁగ దోఁటికందదుగదా' యనుసామ్యముపోల్కి భాస్కరా.

టీ. భాస్కరా! నరులకున్=మనుష్యులకు, సిరి, కలనాఁడు=కలిగి నప్పుడు, ఎట్టికార్యము=ఎటువంటిపని, అయినన్, చిత్తమునందు=మనస్సున, తలంచినంతనె, లభ్యము=పొందదగినది, అగున్, లేనియెడన్=భాగ్యములే నప్పుడు, బహుప్రయత్నముల్=అనేకయత్నములు జరిపినన్, ఐనన్, జతకాదు=కూడిరాదు. ఎట్లనిన, అరయఁగన్=ఆలోచింపఁగా, ఇది, చేతికి, అందుపండు=అందునట్టిఫలము, దోఁటికి = దోంటికైనను, అందదుకదా! అనుసామ్యము=అనిచెప్పుసామెత, సత్యముసుమ్ము=నిజమేసుమా!

తా. 'ఒకప్పుడు చేతికందినపండు మఱియొకప్పుడు దోఁటికందదు' అనులోకోక్తివలె మానవులకు సంపదకలనాఁడు యెంత గొప్పపనియైనను దలంచినంతమాత్రముననే సమకూడును. సంపద లేనప్పు డెంతప్రయత్నము చేసినను సమకూడదు.

చ. స్ఫురతర కీర్తిమంతులగు పుత్త్రులఁగాంచినఁగాక మూఢమ
ష్కరులఁగనంగఁ దేజములు గల్గవుగా; మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టినందున వికాసముగల్గునటయ్య? భాస్కరా.

టీ. భాస్కరా! స్ఫురతరకీర్తిమంతులు=మిక్కిలిప్రకాశించు కీర్తిగలవాఁడు, అగుపుత్త్రులన్=అయినకొడుకులను, కాంచినన్ + కాక=కనినసరిగాని, మూఢమష్కరులన్=జ్ఞానహీనులైనమూఢులను, కనంగన్=కనినట్లయిన, తేజములు=ప్రతిష్ఠలు, కల్గవుగా, ఎట్లనిన, మణి=రత్నములచేత, కీలిత=కూర్పఁబడిన, అంగుళ + ఆభరణములు=ఉంగరములు, అంగుళంబులన్=వ్రేళ్ళయందు, శుభస్థితిన్=శుభకరముగా, పెట్టినన్ + కాక=ధరించినఁగాని, గాజుటుంగరములు, పెట్టినందున్, వికాసము=కాంతి, కల్గునటయ్యా=కలుగునా? (కలుగదు.)

తా. చేతివ్రేళ్ళయందు మణులచేఁగూర్పఁబడిన యుంగరము ధరించినచోఁ జేతికిఁ గాంతికల్గునుగాని గాజుటుంగరము ధరించిన కాంతి కలుగదు. అట్లే మిక్కిలి కీర్తిగలపుత్త్రులను కనినచోఁ ప్రతిష్ఠలుకలుగునుగాని జ్ఞానహీనులయిన మూఢులను కనినప్రతిష్ఠలు కలుగవు.

ఉ. సేనగవాంఛితాన్నము భుజింపఁగలప్పుడుకాక లేనిచో
మేనులుడస్సియుంట నిజమేకద దేహులకగ్నిహోత్రుఁడో
నేనికభోజ్యముల్ గుడుచునేనియుఁ బుష్టివహించు లేనినా
డూనివిభూతిలోఁ నడఁగియుండడె తేజముతప్పి భాస్కరా.

టీ. భాస్కరా! సేనగన్=ఎక్కువగా, వాంఛిత + అన్నము=కోరినయన్నము, భుజింపఁగలప్పుడు= తినునట్టివేళయందు, కాక=తప్ప, లేనిచోన్=అట్టియన్నములేనప్పుడు, దేహులకున్ = ప్రాణికోటికి, మేనులు=

శరీరములు, డస్సియుంట=కృశించియుండుట, నిజము + ఏ, కదా, ఎట్లనిన, అగ్నిహోత్రుఁడు + ఔ + ఏని=అగ్నిదేవుఁడైనప్పటికి, నిజభోజ్యముల్=తానుతినఁదగినపదార్థములు, కుడుచును + ఏనియున్=భుజించెనేని, పుష్టి=వృద్ధిని, వహించున్=పొందును. లేనినాఁడు=అట్టియాహారము లేనిసమయమునందు, తేజమున్=కాంతిని, తప్పి=విడిచి, ఊని=అనుకొని, విభూతిలోన్=బూడిదలో, అడఁగియుండఁడె=డాఁగియుండఁడా! (యుండును.)

తా. అగ్నిదేవుఁ డెక్కువ తేజశ్శాలియైనను తనయిష్టపదార్థములను దినునప్పుడు పుష్టిగల్గి ప్రకాశముగలవాఁడై యుండును. ఆ యాహారపదార్థములులేని సమయమున బూడిదలో నణఁగుపడియుండును. అట్లే ప్రాణికోటులు తమకిష్టమైన పదార్థములు తిన్నచో శరీరకాంతి గల్గియుండును. ఇష్టమైన పదార్థములేనిచో మిక్కిలి కృశించును.

ఉ. హాళినిజప్రబుద్ధి తిరమైనవిధంబునఁ బెట్టుబుద్ధు లా
వేళలకంతెకాని మఱి వెన్కకునిల్వవు, హేమకాంతియె
న్నాళులకుండుగాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినన్
దాళుకయుండునే యినుప తాటకుఁజాయలుపోక భాస్కరా.

టీ. భాస్కరా! హాళినిన్=కోరికచే, నిజప్రబుద్ధి=స్వతస్సిద్ధముగాఁ బుట్టినబుద్ధి, తిరము=నిలకడగానుండునది, ఐనవిధంబునన్ = అగునట్లుగా, పెట్టుబుద్ధులు=ఒకరునేర్పెడిబుద్ధులు, ఆవేళలకున్ = ఆయాసమయములకు మాత్రము, (నిలుచును) అంతెకాని, మఱివెన్కకు=తరువాతకాలమునకు, నిల్వవు=నిలచియుండవు. ఎట్లనిన, హేమకాంతి=బంగారుతళుకు, ఎన్నాళ్ళకైనన్=ఎన్నిదినములకైనను, ఉండున్ + కాని, ఒకనాఁడు=ఒకదినమెల్లను, పదంపడి=ఎంతయు, సానఁబట్టినన్, ఇనుపతాటకున్=ఇనుపరేకునకు, చాయలు=తళుకులు, పోక, 1 తాళుకయుండునే=నిలిచియుండునా? (నిలిచియుండవు.)

తా. స్వతస్సిద్ధముగాఁ బుట్టినబుద్ధి బంగారుకాంతివలె స్థిరముగా నుండునుగాని పరులుచెప్పినందువలన గల్గినబుద్ధి సానబట్టిన యినుపతునుక తళుకువలె, అప్పుడేయుండి వెంటనే నశించును.

1 తాళుకయుండునే=ఇది వ్యాకరణవిరుద్ధము. తాలిమినుండునేయని గాని తాళుచునుండునే యనిగాని పఠించుకోవచ్చును.

ఉ. హీనకులంబునందు జనియించినవారికి సద్గుణంబు లె
న్నేనియుఁగల్గియున్న నొకనేరముచెందకపోదు, పద్మముల్
భూనుతిగాంచియున్ బురద బుట్టుటవల్ల సుధాకరోదయం
బైననసహ్యమొందవె ప్రియంబునజూడఁగలేక భాస్కరా.

టీ. భాస్కరా! హీనకులంబునందున్=తక్కువజాతియందు, జనియించినవారికిన్=పుట్టినవారికి, సద్గుణంబులు=మంచిగుణములు, ఎన్నేనియున్=ఎన్నియైనను, కల్గియున్నన్, ఒకనేరము=ఒకతప్పు, చెందకపోదు. ఎట్లన, పద్మముల్=తామరపూవులు, భూనుతిన్=భూమియందుపొగడ్తను, కాంచియున్=పొందియున్నను, బురదన్, పుట్టుటవల్లన్, సుధాకర + ఉదయంబు + ఐనన్=చంద్రోదయమగునప్పుడు, ప్రియంబున్=ప్రేమతో, చూడఁగలేక=చూడలేక, అసహ్యము + ఒందవె = ఏవగించుకొనవా? (ఏవగించుకొనును)

తా. తామరపువ్వులు లోకమున మిక్కిలి ఖ్యాతినొందినను బురదయందుఁ బుట్టుటవలనఁ గలిగిన దోషముచేతనే చంద్రోదయ సమయమున నేవగించి చూచుచుండునుగాని ప్రియముతోఁ జూడవు. అట్లే తక్కువ కులమునఁబుట్టిన మానవునకెన్ని సద్గుణములున్నను యొకతప్పిదము గుణముకూడ నుండకపోదు.

ఉ. ఇంచుకనేర్పుచాలక విహీనతఁజెందిన నాకవిత్వముఁ
మించునుపహించె నీకతన మిక్కిలి యొట్లనఁదోలుబొమ్మలన్

# గొప్ప జ్యోతిషగ్రంథములు.

| | | |
|---|---|---|
| జ్యోతిషప్రథమబోధిని | 0 | 8 |
| జాతకమార్తాండము 1 భా | 1 | 8 |
| ,, 2 భా | 1 | 8 |
| ,, 3 భా | 2 | 0 |
| జ్యోతిషరహస్యం 1 భా | 1 | 8 |
| ,, 2 భా | 1 | 8 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక } సంజ్ఞాధ్యాయము 1 భా } | 1 | 0 |
| గణితాధ్యాయము 2 భా | 1 | 0 |
| భావఫలాధ్యాయం 3 భా | 3 | 0 |
| ద్వాదశభావఫలం 4 భా | 2 | 0 |
| శల్యవాస్తు | 0 | 12 |
| వాస్తుసంగ్రహము | 0 | 12 |
| నవగ్రహచింతామణి | 0 | 2 |
| జాతకఫలమణిమంజరి 1వ భా | 1 | 8 |
| గర్గసంహిత | 0 | 4 |
| బృహత్పరాశరసంహిత | 0 | 4 |
| గోచారసంహిత | 0 | 12 |
| ఆంధ్రజాతకతత్వము సూత్రములు 1 వ భా | 1 | 8 |
| ,, 2 వ భా | 1 | 8 |
| కాలామృతము | 0 | 12 |

| | | |
|---|---|---|
| అదృష్టదీపిక | 0 | 10 |
| హస్తసాముద్రికము | 0 | 8 |
| జ్యోతిష ఫలప్రదర్శిని | 0 | 10 |
| దశాభుక్తి ఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 |
| పుట్టుమచ్చలశాస్త్రము | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరము | 0 | 8 |
| మయివాస్తు } వాస్తుశిరోమణి } సనత్కుమారవాస్తు } ఈ 3 చేర్చి ఒకేపుస్తకం | 0 | 12 |
| శిల్పసంగ్రహము | 0 | 6 |
| ఆయుర్దాయయోగం | 1 | 0 |
| ముహూర్తదర్పణం | 0 | 8 |
| రెట్టమతశాస్త్రము 60 సం॥ పంచాంగము | 0 | 12 |
| జాతక నారాయణీయం | 1 | 8 |
| స్వప్నఫలదీపిక | 0 | 8 |
| సకలసర్వగుణ అదృష్టదీపిక | 0 | 12 |
| గౌతమసంహిత | 0 | 8 |
| వాంఛానాదీయం | 0 | 8 |
| అనుభవజాతకతరంగిణి | 0 | 8 |

శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# స్తోత్రములు వగైరా గ్రంథములు.

| | |
|---|---|
| శివానందలహరి టీకాతాత్పర్యసహితము | 0-8-0 |
| సౌందర్యలహరి (టీకాతాత్పర్య సహితము | 0-8-0 |
| శివగీత (టీకాతాత్పర్యసహితం, 212 పేజీలు గ్లేజు | 0-12-0 |
| ఉత్తరగీత డిటో | 0-12-0 |
| సంధ్యావందనము మూలము | 0-1-0 |
| సంధ్యావందనము, శ్రీసూక్తము పురుషసూక్తము కలిపి | 0-4-0 |
| ఆదిత్యహృదయము మూలము | 0-1-0 |
| డిటో తాత్పర్యము గ్లేజు | 0-3-0 |
| మహిమ్న స్తోత్రము | 0-3-0 |
| లక్ష్మీనృసింహస్తోత్రము | 0-2-0 |
| నవగ్రహస్తోత్రము | 0-4-0 |
| మంత్రపుష్పము | 0-1-0 |
| రుద్రనమకము చమకము | 0-2-0 |
| భగవద్గీత తాత్పర్యసహితం పెద్దసైజు | 0-12-0 |
| డిటో క్యాలికో పాకెట్ సైజు | 0-12-0 |
| ముకుందమాల (టీకాతాత్పర్య సహితము | 0-3-0 |
| ఆర్యవైశ్యసంధ్యావందనము | 0-2-0 |
| భగవన్నుతి రత్నములు | |
| ,, 1 వ భాగము | 0-2-0 |
| ,, 2 వ భాగము | 0-2-0 |
| ,, 3 వ భాగము | 0-2-0 |
| పైమూడు పుస్తకములు కలిపిన క్యాలికో బైండు | 0-7-0 |
| శివపూజావిధానము | 0-2-0 |

# సహస్రనామములు.

నామావళీ సైతము చక్కని గ్లేజు పేపరులో ముద్దులు మూటగట్టు సైజులలో ముద్రింపబడినవి.

| | |
|---|---|
| విష్ణుసహస్రనామములు | 0-2-0 |
| లలితాసహస్రనామములు | 0-2-0 |
| ఆంజనేయసహస్రనామములు | 0-2-0 |
| శ్రీకృష్ణసహస్రనామములు | 0-2-0 |
| వెంకటేశ్వరసహస్రనామము | 0-2-0 |
| సుబ్రహ్మణ్యసహస్రనామము | 0-2-0 |
| లక్ష్మీసహస్రనామములు | 0-2-0 |
| శివసహస్రనామములు | 0-2-0 |
| శ్రీరామసహస్రనామములు | 0-2-0 |
| గంగాసహస్రనామములు | 0-2-0 |
| గణపతిసహస్రనామములు | 0-2-0 |
| సీతాసహస్రనామములు | 0-2-0 |
| సరస్వతీసహస్రనామములు | 0-2-0 |

మంచివివేకి వానితెరమాటుననుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల డెందమునింపవె ప్రీతిభాస్కరా.

టీ. భాస్కరా = సూర్యభగవానుఁడా! ఇంచుక = కొంచెమైనను, నేర్పు=చాతుర్యము, చాలక, ః హీనతన్=చులకఁదనము, చెందిన నాకవిత్వము= పొందిననాకవనము, నీకతన్=నీదయచేత, మిక్కిలి, మించునట్లు చెన్=ప్రకాశించెను. ఎట్లనఁగా, మంచివివేకి=మిక్కిలి తెలివిగలవాఁడు, తోలుబొమ్మలన్, వానితెరమాటునన్=వానియొక్క తెరచాటున, ఉండి, ప్రశస్తరీతిన్=బాగుగా, ఆడించినన్=ఆడించినచో, ఆడవే=ఆడుటలేదా? ప్రీతిన్=సంతోషముచే, జనులడెందము=మనుష్యులయొక్క మనస్సును, నింపవె=నిండింపవా? (నిండించును.)

తా. ఓసూర్యభగవానుఁడా! నేర్పరియగు మానవుడు తెరచాటున నుండి తోలుబొమ్మలను నేర్పుగా నాడింప యాబొమ్మలే ప్రజలకమితా నందమును గల్గించును. అట్లే నీపేరు నాపద్యముల చివరఁజేర్పబడిన మహత్త్వమువలన కొంచెమైనను నేర్పుచాలని నాకవిత్వము మిక్కిలి ప్రకాశించి ప్రజలకమందానందము గొల్పినది.

శ్రీభాస్కరార్పణమస్తు.

భాస్కరశతకము టీకాతాత్పర్య సహితముగా

సంపూర్ణము. శ్రీ. శ్రీ. శ్రీ

---

భాస్కరముద్రాక్షరశాల, రాజమండ్రి—1988.

